# రయోజన విద్య
# బోధన క్రమము





గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

ప్రకాశకులు

ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు

పటమట పోస్టు, కృష్ణాజిల్లా



చతుర్థ ముద్రణము

దుర్ముఖి - ఆషాఢము

౧౯౫౬



సర్వోదయ ప్రెస్

పటమటలంక

వెల :

రూపాయి

అంకితము

ప్రియసతీమణి

గాడిచర్ల రామాబాయికి

# సతీస్మృతి

౧

పదియు నాల్గవయేట నా ప్రాపుజేరి
మఱుస యేడున దేశాభిమానమునను
నన్ను జైలుకు పంపించి నాతిమిన్న
ధీరవయి మూడు వత్సరాల్ ఘోరతపము
చేసి నన్నును పూలతో చిన్నినవ్వు
మొలచు చుండంగఁ బూజించి మురిసినట్టి
నిన్ను తలపెట్టి నేనెంతొ ఖిన్నుడగుదు.

౨

ముప్పదైదేండ్లు నాతోడ మురిపెమునను
కష్టములనెల్ల ప్రేమతోఁ గడగఁ ద్రోచి
మాట పొంకంబునకు నీకు మహిని సాటి
లేరు లేరని యెల్లరు గారవింప
మనిన దానవు నీవంటి మాన్యచరిత
నాదు హృదయాన నాటిన నాటి స్మరణ
నన్నుఁ బొగిలింప కుండునే యన్న మిన్న !

3

నా భుజస్కంధముల నమ్ము నాతిమిన్న
భక్తివైరాగ్యములఁ గొల్చు పావనాత్మ

౭

యొరులు తానను భేదంబు వరలనీక
బిడ్డలెల్లర సమదృష్టి పెంచుమాత
భువిని విడ్చిచితె పరలోక భూమియందు
ఇట్టిసాధ్వీమతల్లులు ఎవరు లేమి
ఆ కొఱంతను దీర్పగా నరిగి తేమొ!

౮

హరిజన పుత్రుల సరస ప్రోచితి వన
"మాదు లింగన్న" యె మంచి సాక్షి
సాహేబు హిందువు సమము నీకని చాట
సాదు "కబీరు" ని సాక్ష్యముండు
క్రైస్తవుల్ నీప్రేమ కలవార లనుటకు
"బిన్ని" యొక్కడె చాలు పెద్దసాక్షి
బ్రాహ్మణేతరులను పరమ ప్రీతినిఁజూతు
వనియెడు మాటను నవని నుంప
ఎల్లకాలంబు నిన్నె కా 'తల్లి' యనుచు
బెంగుళూరున నుండియుఁ బ్రీతిఁగరము
నిమిష నిమిషము మోడ్చుచు నెటె బొగిలెడు
కృష్ణస్వామియె సాక్షి యా దృష్ణదీర.

౯

ద్వారు ద్వారమ్మ ద్వారయ్య ద్వారకమ్మ
యనుచు బిడ్డను జెంతకు నెనరు తోడ
పిలిచి విలపింపఁబోకుము పెన్నిధాన

మనుచు నెన్నియొ బుద్ధులు వినిచి పిదప
మమత బెంపకు దూరాన మసలు మనుచు
పంపి వైచితి దైవంబు ప్రాపు గోర
ఇట్టి ధీరలు లోకాన నింక కలరె ?

౬

తులసి పూజింపు జ్యోతిని తొలగ నీక
సర్వకాలంబు పోషింపు శ్రద్ధతోడ
అన్నమని చేరవచ్చెడి యర్థకులకు
అన్నమిడగను నేమఱకమ్మ యనుచు
ప్రీతి పుత్రిని శాసించి పెద్ద జ్ఞాను
లెల్లరన్ మించి మమ్ము నీ యెల్లలేని
కల్ల లోకాన దిగఁ బెట్టి కడగ పోతె.

౭

"ఏమి చూచెదు తల్లిరో ఏమిచూతు"
వనుచు నీతల్లి ఖేదాన నడుగ నిన్ను
"నిన్నుఁజూడను, దేవుని నేను కొల్చు
చున్న దానను 'సన్మార్గ మెపుడు నాకు
చూపు' మని, కాన దుఃఖంబు సోక నీకు"
మన్న చరితంబు ధన్యమై యలరుగాదె.

గా. హరిసర్వోత్తమరావు

# ప్రకాశకుల విజ్ఞప్తి

వయోజన విద్యా బోధకులకు ఉపయుక్తమైన యీ గ్రంథం మూడవ కూర్పును 1952 ఏప్రిల్‌లో మేము ప్రచురించి యుంటిమి. ఇప్పుడు నాలుగవ కూర్పును తిరిగి ప్రచురించు అవకాశము మాకు లభించినందులకు సంతసించుచున్నాము.

ఈ కూర్పులో పెద్ద మార్పులేమీ చేయలేదు. ఈ అవకాశమును మరల నొకసారి మాకు కల్పించిన గ్రంథకర్త పూజ్య శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావుగారికి మాకృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

పటమటలంక
25-7-1956

కొమ్మా సీతారామయ్య
పాలక ధర్మకర్త

# విషయసూచిక

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 10 | రాజకీయసంవేదన | రాజకీయసంవేదన |
| ,, | 16 | రాజకీయశ్రృంఖలాలను | రాజకీయశృంఖలాలను |
| 19 | 22 | యీనాదినము రష్యాలో నియంతగా ఉండే | రష్యాలో నియంతగా ఉండిన |
| 20 | 1 | వుండే అట్లీకూడ | వుండిన అట్లీకూడ |
| 25 | 7 | నేర్చ్పటకు | నేర్పటకు |
| 54 | 17 | ప్రత్యేకము, కథ అల్లుటకంటే | ప్రత్యేకము కథ అల్లుటకంటే, |
| 55 | 2 | పదమును | పదము |
| 56 | 23 | శృంగార పురములో | తెనాలితాలూకా శృంగారపురములో |
| 61 | 2 | బొమ్మ పాము | 'పాము' బొమ్మ |
| 69 | 12 | వుర్దూలిపీ | వుర్దూలిపి |
| 70 | 2 | అందుత | అందుచేత |
| 71 | 23 | 'వాళ్ళకు' అనుమాట స్ఫుటముగా కనబడుటలేదు. ఇది పెద్దలైన, కొంతవరకు అనుమాటల మధ్యనున్నది. | |
| 75 | 5 | ప్రత్యామ్నాయ అనుమాటలో 'మ్నా' సరిగా అతకలేదు. | |
| 76 | 11 | నకుమేర్పాట్లు | నకు యేర్పాట్లు |
| 94 | 13 | 17. గ్రంథాలయ గీతాలు | * 17. గ్రంథాలయ గీతాలు |

# వయోజనవిద్య — బోధనక్రమము

## ౧. తొలినుడి

చదువను, వ్రాయను నేర్పుటచేత దాని కదే ఫలమని యెవరును అనుకొనరాదు. ఫలమును సాధించుటకు ఇదియొక యుపకరణము. నిజముగా భాషాభ్యాసముకూడా తనంతట ప్రత్యేకాదర్శమని చెప్పుటకు వీలులేదు. అక్షరమాలను మానవుడు సృజించుకొనిన రీతిగానే భాషనుకూడా సృజించుకొనినాడు. మానవుడికీ, మానవుడికీ మధ్య భావప్రచారము చేయడానికి ఇది సాధనము. ఆ మూలకంగా సభ్యత పెంచుకోడానికి ఇది ఆధారము. నేను తెలుగువాణ్ణి. స్పెయినుప్రజలు తమలోతాము మాట్లాడుకోవడము వింటాను. నే నాభాషను నేర్చుకొనివుంటే తప్ప, ఆ విషయమంతా, నాకు అగమ్యగోచరముగా వుండకతప్పదు. కాబట్టి భాషను సభ్యతను ఆకాశానికి పొగడుతూ, చదువనూ వ్రాయనూ నేర్పుటపై వుపేక్షాభావము చూపేవారిని చూస్తే ఆలోచనాపరులందరికివలెనే నాకూ అపహాస్యంగా కనిపిస్తుంది.

### ప్రాతకాలాన చదువు, వ్రాతలు

భాష నేర్చుకొనుటకు, విజ్ఞానము సంపాదించుటకు అక్షరాస్యత అత్యావశ్యకమని ఈ కాలములో మన మంగీకరిస్తూ వుండడంకలదు. అట్లనుటచేత ప్రాచీనకాలమందు అక్షరాస్యతలేదని తీర్మానించడం పొరపాటు. అశోకుడు రాతి స్తంభములమీద బౌద్ధధర్మములను చెక్కించడము

ఒక్కటే చాలును మనకు యీవిషయములో చారిత్రకమైన రుజువు. శిలలమీద, రాగిరేకుల మీద, ఇతరత్రాను సంగతులు చెక్కించిన అశోకుడు వగైరా పెద్దలు తమ సంతోషము కొరకు ఆ పనిని చేయలేదు. ప్రజలు చదువుకొని లాభపడవలయునను వుద్దేశము వారికిలేకపోతే ఆపని చేసేవుండరు. అంటే ఆదినములలో చదువనూ వ్రాయనూ ప్రజలు బాగా నేర్చియుండిరనుటస్పష్టము. పంచాయతులు, వీధిబళ్ళు, వుర్దూ ప్రజల మక్తబులు, ఇవన్నీకూడా ప్రాచీన భారతభూమిలోని వ్రాత, చదువుల ప్రచారమునకు ఆధారములుగ వుండినవి.

అక్షరాస్యత సర్వజనీనమా ?

పుట్టిన ప్రతిబిడ్డకు చదువు నేర్పించవలయు ననిగాని, వయోవంతుడు ఒక్కొక్కడు చదువరి కావలయునని గాని ప్రాతకాలములో ప్రయత్నించి రనుట నిజముకాకపోవచ్చును. అది నాటిప్రపంచములోనే ఆదర్శముకాదు. పడమటి దేశాలలో యిట్టి ఆదర్శము లేదుగదా ! అవి జాగృతిపొందికూడ వుండలేదు. ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధనలచేత అచ్చుయంత్రములు ప్రచారమునకువచ్చినపిదప, స్వతంత్రరాష్ట్రములలో అంతటా పుట్టిన ప్రతిబిడ్డ, చదువరియై జీవితసౌధాన్నిపై అంతస్థువరకు ఎక్కుటకు అర్హుడు కావలయుననే సిద్ధాంతము అమలులోనికి వచ్చినది. నిర్బంధ విద్యావిధానము, నూటికి నూర్గురు అక్షరాస్యులు కావడము అనే వుద్దేశాలు పారిశ్రామిక అభివృద్ధి, సముద్రాలమీంది వ్యాపారము, నానా జాతులమధ్య పరస్పర సంబంధములు యేర్పడిన తరువాత, ముందడుగు వేసిన రాష్ట్రములలో తలచూపినవి.

## మన దేశము

మన దురదృష్టము యేమోకాని పాశ్చాత్యదేశములన్నీ, తూర్పున జపానువంటి దేశము సత్వరాభివృద్ధి పొందుతూవుంటే, మన బ్రిటిష్ పరిపాలకులు మనకు ఎంతమాత్రం వికాసము యివ్వదలచిరో అంతేపొందుతూ మనము పరిపాలితరాష్ట్రంగా పడివుండవలసి వచ్చినది. మన ఆర్థిక జీవితము నాశనమై పోయినది. మన గ్రామపంచాయతీలు అదృశ్యమైనవి. మన మత సాంఘిక జీవితములు ఘనీభవించి పోయినవి. దీర్ఘదాస్యము మనపాలిట బడినది.

మన దేశములో రాజకీయసంవేదన మొలకెత్తిన యీ శతాబ్దారంభమునందు మన ప్రజల నందరినీ చదువనూ, వ్రాయనూ సమర్థులను చేయవలయునను ఉద్దేశ్యము అంకురించినది. వారిని వికాసవంతులను చేయవలయునను అభిలాష కలిగినది. దేశమునందు రాత్రి పాఠశాలల మూలమునను, జాతీయవిద్యాలయాల మూలకంగాను ప్రయత్నములు జరిగినవి. అయితే మనలను కట్టివేసిన రాజకీయశృంఖలాలను సత్వరంగా త్రెంచుకోవలయుననే ఆవేదన ఈ శతాబ్దపు మొదటి నాలుగు పదుల ఏండ్లలో చాల గట్టిగా మనలను ఆక్రమించినది. అత్యుదాత్తమైన పోరాటమును విదేశపరిపాలన మీద మనము సాగించినాము. ఈ ప్రయత్నమునకు ప్రజల హృదయములను తొందరగా ఆకర్షించటం అవసరమన్న విషయం తెలుసుకొని, తదనుగుణంగా కార్యక్రమము నేర్పాటు చేయవలెనను దృష్టి మనకు కొరవడినది. అంతే

కాదు, రాజకీయంగా ఇతరులచేత పాలితులమైవుండి, ఆర్థికంగా దాస్యంలోవున్న మనకు అనుదినచర్యలోని విజ్ఞాన వికాసములను వినియోగించే అవకాశముకూడా వుండలేదు. కాబట్టి దేశాభిమానముకలవారు ఎంతగట్టిగా ప్రయత్నములుచేసినా చదువులవైపుకు, విజ్ఞానము వైపుకు ప్రజలనాకర్షించుట కుదరలేదు. బంగాళా విభజనచేత ఏర్పడిన 'వందేమాతరం వుద్యమం' మన ఆంధ్రులలో గొప్పహృదయావేదనను కలిగించి భాషాభిమానమును పురిగొల్పినది. ఇందుకు ఫలితంగా ఆంధ్ర దేశములో ఆంధ్రోద్యమము, ఆంధ్ర గ్రంథాలయోద్యమము కొనసాగినవి. అచిరకాలములో పంద్రెండు వందల గ్రామ గ్రంథాలయములు యేర్పడినవంటే, ఆంధ్రుల ప్రయత్నము ఎంత గాఢముగా సాగినదో అర్థమవుతుంది. వారు తమ మాతృభాషమీద ఆధారపరచి పరిపాలన సాగించుకొనవలయుననే వుద్దేశముతో ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేక పరచి ఇవ్వవలయునని కోరడముతో ఇతర భాషాపుత్రులకు కూడా ఇదే విధమైన భాషాధారక రాష్ట్రములు యేర్పాటుకావలయునని కోరిక కలిగినది. మన దేశములోని మానవ హృదయములో ప్రజాస్వామ్యముపట్ల ఎంత గాఢవిశ్వాస మున్నదో, సామాన్య ప్రజలు అక్షరాస్యులై, విజ్ఞానవంతులై దక్షతతో తమరాజ్యమును తాము ఏలుకొనేవారు కావలయునని ఎంత హృదయావేదన వున్నదో దీనివలన స్పష్టమగుచున్నది.

### ప్రజాస్వామ్యమునకు అక్షరాస్యత అవసరము

ఆంధ్రులమైన మన యీ కోరికను భారత దేశీయ మహాసభ, అంటే కాంగ్రెసు బహుకాలంగా అంగీకరించింది.

తన కార్యక్రమాన్ని నెరవేర్చుకోడానికి భాషాధారకమైన రాష్ట్రములను స్థూలంగా విడదీసి పనులు నిర్వహించుకొన్నది. ఈజాతీయవికాస మొకవైపు తీక్ష్ణంగా అభివృద్ధి అవుతూ వుండగా వేరేవేరే ఉద్దేశములతో వేర్వేరు బాపతులవారు అనేక మోస్తరులుగా కొద్దికొద్దిగా అక్షరాస్యతా ప్రచారము చేస్తూ వుండినారు. ఇందులో నిజంగా యెన్నదగినవారు పరదేశీయులైన పాదరీలు. వారి మతము, వారిబోధ వ్యాప్తి కావలయునంటే ప్రజల మాతృభాషలో ప్రజలకు అక్షరాస్యత వుంటేనేతప్ప పని సాగదని వారు గ్రహించిరి. కాబట్టి తమ జనులకు అక్షరాస్యత కలుగజేయుటకు వారు పలు పాట్లుపడిరి. అందుచేతనే ఒక్కొక్క జనాభాజరిగినప్పుడంతా లెక్కలు చూస్తూవస్తే, మనదేశంలో ఎక్కువ అక్షరాస్యత క్రైస్తవులలో ఉందనడం రుజువు అవుతూ వచ్చినది. మతము పట్టించే దృష్టితో చేసినా, వారుచేసిన యీ కృషికి మనం వారికి కృతజ్ఞులుగా వుండితీరవలయును. ఈ విధముగా చదువనూ, వ్రాయనూ నేర్చిన క్రైస్తవులలోను ఆధునికదృష్టితో చూస్తే ఎక్కువగా వికాసవంతులైనవారు స్త్రీలే అని గోచరిస్తున్నది. కాబట్టి వారిమీదను, సంఘములోని ఇతర భాగాలలో కొద్దిగానైనా చదువనూ, వ్రాయనూ తయారైన స్త్రీలమీదను, మనదేశములోని స్త్రీలలో అక్షరాస్యత, విజ్ఞానముల ప్రచారముచేసే బరువు ఎక్కువగా నిలిచినది. నిజానికి స్త్రీలు చదువరులైతేనే, మనజాతి చదువరులు కావడానికి అవకాశము. మనదేశ పరిపాలనకై బ్రిటిషు పభుత్వమువారు నియమించిన 1935 సం. గవర్నమెంటు ఆఫ్

యిండియా ఆక్టు వలననే అక్షరాస్యతకు వ్యగ్ర స్వరూపము కలిగినదని చెప్పకతప్పదు. అందులో బ్రిటిష్ ప్రభుత్వము వారు అక్షరాస్యత గలవారికి వోటివ్వడమనే విధానాన్ని ప్రచారమునందు పెట్టిరి. కాని యీ అక్షరాస్యత అనేదానికి పలు ప్రాంతములలో పలువిధాల నిర్వచనముచేసిరి. మన దక్షిణ రాజధానిలోను, మరికొన్ని యితర ప్రాంతాలలోను అక్షరాస్యత అంటే, ఇతరులు వ్రాసిన ఉత్తరము చదువు కోడానికి, బదులు వ్రాయడానికి సామర్థ్యమని అంగీకరించిరి. మనకు రాజకీయ వికాసము అంకురించిన దినమునుంచి వయోజన వోటు కావలయునని ఆందోళన చేస్తూనే వున్నాము. పూర్ణ ప్రజాస్వామ్యమునకు అదే ఆధారమనికూడా వాదిస్తు న్నాము. కాని దానికే అక్షరాస్యతకూడ జోడించకపోవడము చేత మనదేశంలో అక్షరాస్యతను గట్టిగా నొక్కి సాధించు టకు ప్రబల ప్రయత్నములు జరుగలేదు. అక్షరాస్యతవోటు మూలకంగా వయోజనులందరికిని వోటు సాధింపవచ్చుననే ఆశ పొడగట్టగానే ప్రజాహిత కార్యపరుల దృష్టిలో అక్షరా స్యత ప్రచారము చాల ఆకర్షణమైనదిగా తోచినది. అవంతి (ఔంధు) సంస్థానాధీశ్వరునికి అతని సంస్థానములో స్వరా జ్యము స్థాపించమని వుపదేశిస్తూ గాంధీజీ అక్షరాస్యులంద రికి ఓటిచ్చి పంచాయతుల నేర్పరచమని ఈ ఉద్దేశ్యము సాధించడానికి 1 సంవత్సరం లోగా అతని సంస్థానములోని సర్వ ప్రజలను - స్త్రీలను, పురుషులను అక్షరాస్యులను చేయ మని నొక్కి ప్రతిపాదించడముచేత అక్షరాస్యతా ప్రచారము నకు గొప్ప దోహదము కలిగినది. దీని ప్రభావము చేతనే

మొదట కాంగ్రెసు ప్రభుత్వాలు రాష్ట్రాలలో ఏర్పడినప్పుడు బీహారు, సంయుక్తపరగణాలు, బొంబాయి ప్రాంతాల ప్రభుత్వాలవారు విస్తారమైన అక్షరాస్యతా ప్రణాళికలను అమలులో పెట్టిరి. మన మద్రాసులో నాడు అధికారము వహించిన ప్రధానికి ఈధోరణి కలుగలేదు. త్రాగుడునిరోధాన్ని సాగించుటకు అక్షరాస్యతను ఆపిపెట్టవచ్చునని ఆయనకు తోచినది. అందుచేత ఈరాష్ట్రంలోని నిరక్షరాస్యతను నిర్మూలించే ప్రయత్నమునకు అధికారేతరులే పూనుకోవలసి వచ్చినది. కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడడానికి ముందే, ఆంధ్రదేశములోని గ్రంథాలయోద్యమ నాయకులు కొందరు అక్షరాస్యతా ప్రణాళికలను వేసి ప్రచారము చేయుచుండినారు. దక్షిణరాజధానిలోని ఇతర ప్రాంతాలలో 'లాబకు' అనే విదేశీయుడు కాలుపెట్టి ప్రచారము చేసేవరకు ఈ విషయమున జాగృతి కలుగలేదు. 1939వ సం. లో మహాసభ జరిగి దక్షిణభారత వయోజన విద్యాసంఘ మేర్పడినది. నాటినుండి ఈ 16 సంవత్సరములుగా పని జరుగుచుండెను. యువకులు చాలా వుత్సాహముతో ఈ పనిలోనికి ప్రవేశించి కార్యక్రమముసాగించినారు. అయితే మధ్యకాలములో మరల అధికారము వహించిన బ్రిటిష్ అధికారులకు ఈ అభివృద్ధి గిట్టినదికాదు. 1941 వ సం. లో అన్ని వయోజన విద్యా తరగతులను, పయోజన విద్యాశిక్షణ తరగతులను నిర్బంధాలకు లోనుచేస్తూ వారు వుత్తరువు ప్రకటించిరి. అది మన కార్యవేగమును కొంత మందగింపజేసెను. కానిఅప్పుడు

కలిగిన అనుభవములను బట్టి మనము కొన్ని ముఖ్య విషయములను తెలుసుకో గలిగినాము.

అనుభవాల ఫలములు

1. మహాజనము మీద అక్షరాస్యతా ప్రచారము వ్యాపింప చేయవలయునంటే పాఠశాలలు మాత్రముతో పని పూర్తికాదు. దేశమంతటా పనిచేసే కార్యకర్తల కివి పుదాహరణ ప్రాయంగా కొంతప్రోత్సాహము కల్గింపగలవు. ఈ తరగతులలో పనిచేసే బడిపంతుళ్లకు మాసవారీ జీతమివ్వడం చేతకూడ పూర్తిప్రయోజనంకలగడంలేదు. ఒక్కొక్కవయోజనవ్యక్తికి ప్రత్యేకం ప్రత్యేకంగా కొంతశ్రద్ధతో నేర్పితేతప్ప వయోజనులు తరగతులలో నిలువరు. అందువల్ల ఏ మూడు మాసములలోపుగానో వ్యక్తులను అక్షరాస్యులను చేస్తే అట్టి ఒక్కొక్క వ్యక్తికి ఇంత అని ప్రతిఫలము యిచ్చే ఆచారము వుపయోగపడుతుందని తోచినది. చదువనూ, వ్రాయనూ నేర్చుకొనేటప్పుడే వారికి వివిధవిషయముల విజ్ఞానము సమకూరితే సమకూరవచ్చును. సమకూర్చడము మంచిదే. కాని తనిఖీచేసే విద్యాధికారులు ఈవిషయం పరీక్షించుట ఆరంభిస్తే ప్రయోజన ముండదు. చదువనూ, వ్రాయనూ, నూరుఅంకెల వరకు గుర్తింపనూ వచ్చునా లేదా అనుట మట్టుకే ఇచ్చట ప్రసక్తి. ఇంతవరకు ఫల మేర్పడిన తర్వాత కొన్ని కొన్ని అక్షరాస్యత పాఠశాలలను చేర్చి ప్రత్యేక కేంద్రమొకటి నియమించి అచటికి చదువనూ, వ్రాయనూ నేర్చినవారిని చేర్చి వివిధవిషయములను గురించిన విజ్ఞానమును నేర్పించవచ్చును.

1. ఒక్కడు మరొక్కనికినేర్పుట అనుప్రణాళికను అమలులో పెట్టడమే ఐచ్ఛిక బోధకులచేత పనిచేయించ డానికి తగిన విధానము. ఈవిధానాన్ని అనుసరిస్తే ఒక కేంద్రా నికి వయోజనులను రాబట్టనక్కరలేదు. ప్రత్యేకము స్థలమూ, అనుకూలాలూ యేర్పరచుకోనక్కరలేదు. వయో జనుణ్ణి కేంద్రానికి ఆకర్షించి తీసుకొని రావడంలో వుండే కష్టాలూ వుండవు. అంతేగాక చాలమంది ఐచ్ఛిక సేవకులను తరిఫీదుచేసి వారి వారి అనుకూలముకొద్దీ వారు ఒక్కరికో పలువురకో తమ యిరుగు పొరుగు వారికి, చదువనూ వ్రాయనూ నేర్పించుటకు అవకాశము యేర్పడుతుంది. ఒక్క రికి వొక్కరు నేర్పడమనే ఈ విధానములోని రహస్యమేమో స్పష్టంగా తెలుసుకోవడం అవసరము. ఇప్పుడుండే చదువు కొన్నవారు అంతమందీ వెంటనే తమకు సాధ్యమైనంతమందికి ఇతరులకు చదువనూ వ్రాయనూ నేర్పించవలయును. వారి వద్ద తయారై కొంత అర్హతగడించిన క్రొత్తచదువరులు తమ మట్టుకు తాము ఇంకా చదువరులు కాకుండా నిల్చినవారికి చదువులు నేర్పించే ఐచ్ఛిక సేవాదళముగా యేర్పడవలయును. ఇట్లు క్రొత్తగా చదువుకునేవారందరు అక్షరాస్యతావ్యాప్తికి క్రొత్తక్రొత్త ఐచ్ఛిక సేవాదళాలుగా యేర్పడుతూపోతే బహు స్వల్పకాలములో దేశమంతటా సర్వజనులకూ చదు వనూ, వ్రాయనూ, వికాసము పొందనూ అవకాశము కలు గును. దీనికికావలసినది ఒక్కటే సాధనము. వయోజనులకు చదువులు నేర్పించుటకు తగిన శిక్షణ యెంత విరివిగా వీలైతే

అంత విరివిగా చదువుకున్న వారందరికీ యిస్తూ, వారికి యితరులకు నేర్పే ఉత్సాహాన్ని కలిగించడమే మార్గము.

3. తరగతులు పెట్టి చెప్పినా, ఒక్కొక్కరికి బోధించినా, యేవిధానము అవలంబించినా పసిపిల్లలకు చదువునేర్పే వుపాధ్యాయులు కానీ, వుపాధ్యాయుల వృత్తంటేనే యెరుగని తదితరులు కానీ బోధకులుగా వుపయోగపడరు. వయోజనులకు చదువునేర్పించడానికి ప్రత్యేకం శిక్షణ అవసరము. వయోజనుని మనస్తత్వము పిల్లల మనస్తత్వము కంటె భిన్నము. చదువుకొనుటకు తయారయ్యే వయోజనుడు ఒక్కొక్కప్పుడు అంతస్థులో బోధకునితో సమానుడో, యెక్కువ వాడో అవుతాడు. కాబట్టి వయోజనునికి విద్యనేర్పడంలో బోధకుడు తగిన జాగ్రత్తతో మెలగకపోతే అతడు వయోజనులను ఆకర్షించుటకు బదులుగా తిరుగగొట్టే వాడుకూడా కావచ్చును. అందువలన నిరక్షరాస్యతానిర్మూలన వుద్యమమే దెబ్బతినడము సంభవించును.

### నిరక్షరాస్యతా నిర్మూలన ప్రచారము

ఒకరికి మరియొకరు బోధించడమనే సూత్రముమీద ఆధారపడి అధికారేతరులే దానిని నడపవలసినవారు కావడం సంభవిస్తున్నదిగనుక, స్వల్పకాలములో యెంతమందికి బోధక శిక్షణ యివ్వడానికివీలుందో అంతమందికి ఈశిక్షణ యేర్పాటు చేయడము అత్యవసరంగా కనిపిస్తున్నది. ఈ విధంగా శిక్షణను చదువుకున్న వారందరి అందుబాటులో పెట్టితే ఒక్కొక్కరు ఒకరినో, కొందరినో అక్షరాస్యులనుచేసే వుత్సాహముకూడా

వారికి జనింపవచ్చును. ఈ దృష్టిపథము వుండడం చేతనే యీ చిన్ని గ్రంథము వ్రాయటం తటస్థించినది. తగినవారు తరగతులు యేర్పరచి వయోజనులకు పాఠశాలలు పెట్టకూడదని యిందులో అభిప్రాయము యెంతమాత్రమూ కాదు. నిజానికి యీపుస్తకంలో చెప్పే అనేకవిషయములు తరగతులలో బోధచేయుటకు పనికొచ్చేవి కలవు. మొత్తముమీద వ్యక్తిని, మానవసమూహంనుంచి వేరుచేసి వ్యవహరించుటకు సాధారణంగా సాధ్యంగాదు. ప్రతివ్యక్తి ప్రపంచములో తనకుండే సంబంధ బాంధవ్యములను, జవాబుదారీలను అర్థంచేసుకునే వ్యక్తిగా తయారు కావలసివుంటుంది. కాబట్టి వ్యక్తిగతంగా బోధించినా గుంపు చేర్చి బోధించినా బోధనవిషయంలో భేదముండటానికి వీలులేదు.

# ౨. ఉద్దేశములు

"హృదయానికి చొచ్చుకొనిపోయే వేదనశబ్దము వింటేనే కాని యితరులు కష్టము అనుభవిస్తున్నారనేది అర్థం చేసికోక పోవడము మానవదోషము. మానవప్రపంచములో బహుళ సంఖ్యాకులైన నిరక్షరాస్యులు, వీరిదుఃఖము మనకు వినిపించే టట్లుగా కేకలు పెట్టగల వారుకూడా కారు."

మన ప్రపంచము యీ దినము అతి శీఘ్రగమనముతో నడుస్తున్నది. శబ్దానికంటె యెక్కువవేగముగా ప్రయాణము చేయగల ఆకాశవిమానము యీ శీఘ్రగమనాన్ని సంకేతిస్తూ వున్నది. దీనికి సమమైన వేగంతోనే పరిశోధకులు మానవ జీవితానికి సంబంధించిన అన్నిశాఖలలోను క్రొత్త క్రొత్త వివరాలను కనిపెట్టుచున్నారు. అణువునుంచి పరమాణువుకు, పరమాణువునుంచి యెలక్ట్రానుకు మనశాస్త్రము అధిగమించి, ఎలక్ట్రానుయొక్క చలనము అద్భుతంగా వివరణ పొంది మనను ఆశ్చర్యసముద్రములో ముంచినది*. ఈ విజ్ఞానఫలితముగా ఆటంబాంబు లోకాన్నే ఆహుతి కొంటుందేమో అనేభీతికి కారణమైనది. ఈవేళ మనయెరుకలోకివచ్చిన నక్షత్రములు సుమారు 125, 000, 000, 000 వున్నవని అంచనా వేసినారు. మన యింటి యిరుగు పొరుగునవున్న సమ

---

* యీ వివరాలు తెలియడానికి శ్రీ వసంతరావు వెంకట్రావుగారి 'విశ్వ రహస్యము' చూడండి.

ప్రదేశమును మనం పరిచయం చేసుకొని యేమూలకు యే రాయి, యే పెళ్ళ, యే మిట్ట, యే పల్లము వున్నదో పటము వ్రాసుకొనగలిగినట్లే ఆకాశాన్ని గళ్లక్రిందవిభాగించి నక్షత్రము వునికిని, వాటికి సంబంధించిన ఇతర వివరములను మానవుడు పటములోవలె చిత్రించినాడు. రేడియో మెదడు అనే పేరిట మానవుని మెదడుకు రమారమిగా సరిపోయేటంతటి యంత్రాన్ని నిర్మించినాడు. ఈయంత్రముచేతికి లెక్కలు అందిస్తే అందులో బాపతులను వేరుపరచి, గణితములోని అన్ని సంకలన వ్యవకలనాది పనులను కావించి, ఫలము తేల్చి దానిని వ్రాసి అందిచ్చునట్టిశక్తి యిట్టి యంత్రములకు కలదు. నేటిదినము వ్యవసాయము, ఆరోగ్యము, పరిశుభ్రత, తిండి, నివాసగృహములు వగైరా అన్నింటి నిర్వహణమునకు విజ్ఞాన శాస్త్రముమీద ఆధారపడి నిర్మితమైన చట్టాలు యేర్పడినవి. మన ప్రాచీనకాలపు పెద్దలకు యివీ, యింతకంటే యెక్కువైన విషయాలూ తెలిసివుండెనని వాదించేవారు కొందరున్నారు. కాని పురాతనపు అర్థము చెప్పుకోవలసివచ్చినా, నేటి వైజ్ఞానిక పరిశోధనల ఆధారంతోనే చెప్పుకోవలసియున్నది. అక్షరాస్యతలేని యీ దేశంలో వుండే మనం యితర ప్రదేశాల ప్రజలకంటె విజ్ఞానవిషయాలలో వెనుక బడిపోతున్నాము. జ్ఞానమును గురువుల కంఠాలద్వారా ప్రజలకు యెక్కజేసే ఆచారము ప్రాచీనకాలములో పనికివచ్చినదే కాని, అతి త్వరగా ప్రపంచమంతటా వ్యాపిస్తుండే అక్షరరూపమైన విజ్ఞానము సంపాదించుటకు యిదికొరగాదు. రమారమి 40 సం.లు కాంగ్రెసువారు తీక్ష్ణంగా ప్రచారములు సాగిస్తే ప్రజలకు

రాజకీయవికాసము మాత్రము కలిగించడమైనది. నిర్మాణ యుతమైన విజ్ఞానం ప్రజలలో వ్యాపింపచేయడము జరగలేదు. సామాన్యమానవుడు తనశక్తిని తాను గ్రహించగలుగలేదు. నాయకులకు అనుచరులున్నారు. కాని యీ అనుచరులు ఆత్మవికాసం కలవారని చెప్పుటకు రాదు. యీ పుస్తకం వ్రాస్తుండే గ్రంథకారుడు శాసనసభలో సభ్యుడుగానున్నప్పుడు యీ ప్రకరణము ప్రారంభంలో యిచ్చిన వుద్ఘాటనలోనిసత్యాం అతనికి బయల్పడినది. మనదేశంలో అక్షరాస్యులు కాని మహాజనము తమగోడును అధికారులకు వినిపించేటట్లు చేసికో లేక పోవడమే కాక, తమ ప్రతినిధులకు కూడా తెలుపుకో లేనంతటి దుస్థితిలో వుండడం అర్థమైనది. గ్రామాలలోనికి తాను స్వయంగా వెళ్ళి ప్రశ్నించి ప్రశ్నించి, గ్రామస్థుల కష్ట ములు తెలుసుకొని, అవసరమైన కాగితములువ్రాసి గ్రామ స్థుల బొటనవ్రేలి ముద్రలు వేయించేవరకు గ్రామస్థులకు కష్ట మున్నదని తెలియడమే దుస్సాధ్యముగావుండినది. 900 గ్రామ ములుకల జిల్లాకు ప్రతినిధిగా యేర్పడినవాడు యింత పని చేయడము సముద్రానికి యేతమెత్తడమే. ప్రజానీకంలో రాజ కీయ వికాసము అభివృద్ధియైన యీ దినములలో ప్రజానాయ కులు తమలోతాముపడే ఘర్షణలచేత రాజకీయవ్యూహాన్ని దిద్ద గలిగితే దిద్దగలుగుతారు కాబోలును. అందులోకూడా నిర క్షరులైన మహాజనుల దౌర్బల్యాన్ని వినియోగించుకొని తమ పెత్తనాన్ని సాధించడమూ సాగుతూ వున్నది. అందుచేత ప్రజల నిజమైన కంఠస్వరము వినరావడములేదు. రాజకీయా లలోతప్ప, తక్కినవిషయాలలో, నాయకులు ప్రజలకు దిగ

మ్రింగడమేకాని యితరత్రా ప్రయోజన మున్నట్లు రుజువు కాలేదు. అందుచేత వయోజనవిద్య వుద్దేశ్యము యేమిగా వుండాలో స్పష్టంగానే కనిపిస్తూవున్నది.

సామాన్యమానవుడు, యితరులు తన్ను బేస్తుగాపెట్టి తమ స్వలాభంకోసం నాటకమాడి తన్ను తొత్తును చేయకుండా స్వతంత్రుడుగా నిలుచుటకు ప్రతివ్యక్తికిని విద్యావికాసములు అత్యవసరమైనవి.

ఈ వ్యక్తిస్వాతంత్ర్యాన్నే మూడుభిన్నమైన ప్రయోజనముల క్రింద విభాగించి చెప్పవచ్చును.

(1) భౌతికంగా మేలుతరమైన జీవితమును నడుపుకోవడం.

(2) మేలుతరమైన పౌరుడుగా వ్యవహరించడం.

(3) జీవితాన్ని సభ్యుడుగా, ఆనందంతో సమ్మిళితంచేసి అనుభవించడం.

యీ విభాగములపేర్లు చదివినంత మాత్రముననే ఒక్కొక్కదానికి సంబంధించి అనేకమైన వుదాహరణములు యెవరి మనస్సుకైనా తట్టగలవు. అయినా స్పష్టపరచడం కోసం కొద్దిగా వీటి వివరణ చేసుకొందాము.

### భౌతికంగా మేలుతరమైన జీవితమును నడుపుకోవడం

(అ) యేమనిషైనా తనచేవ్రాలు తాను చేయగలిగి తనకు యింకొకడిచ్చిన రశీదును చదువగలిగితే అప్పిచ్చే షావుకారు పెట్టే చిత్రహింసనుంచి బయటపడి బ్రతుకవచ్చును. ఇంతకంటె మెరుగు యింకొక విషయమున్నది.

యీదినము సహకార సంఘాలని, వుత్పత్తిని అమ్మటకూ, కొనుగోలుకూ అన్నిటికీ గ్రామ గ్రామాన సంఘాలేర్పడు తున్నవి. సహకారానికి సంబంధించిన పదిముఖ్యసూత్రములు వేదంలోని "సత్యంవద, ధర్మంచర" అన్న సూత్రాలవలె యేర్పడి వున్నవి. చదవనూ వ్రాయనూ తెలిస్తేనేకాని ఇవి చదువుకోడానికి రాదు. సంఘానికి సంబంధించిన రికార్డు వ్రాయుటకు రాదు. చదువుటకు రాదు. సంఘం వుద్దేశ్యము లను నిలవబెట్టుటకు రాదు. ప్రయోజనములను అనుభవించు టకు రాదు. స్వలాభాపేక్షాపరులైన చదువు వచ్చిన ఒక రిద్దరి యింద్రజాల మహేంద్రజాలము నుండి తప్పించుకొనుట కును రాదు.

(ఆ) పిల్లలకు, బంధువులకు వుత్తరములు వ్రాసుకోవ డము, వారువ్రాసిన వుత్తరములు చదువుకోవడము చదువు రానివారికి సాధ్యంగాదు. పాపం సైన్యాలలోనికి వెళ్ళిన మగ వాళ్ళను పెండ్లిచేసుకొన్న స్త్రీలు భర్తల యోగక్షేమాలను కనుక్కోడానికి ఆతురతతో వేచియుండి, తమకు అక్షరము రాకపోవడంచేత వారు వ్రాసిన వుత్తరములు యితర మగ వాళ్ళచేత చదివించుకోవలసి వచ్చి, చదివేవారికీ, చదివించు కొనేవారికీ, యిరువురికీ ఒక్కొక్కప్పుడు కలిగిన సంకోచ స్థితిని అనుభవించిన వారే యెరుగుదురు.

(ఇ) యీ కాలంలో ప్రభుత్వమంతా కాగితాల మీద నడిచే ప్రభుత్వంగావున్నది. కంట్రోళ్ళు, రేషనులు, పర్మిట్లు బలిసిపోయిన యీ దినములలో చదువులు రానివారు పడే దురవస్థ కుక్కలకుకూడ వద్దనిపిస్తూ వున్నది. వొక కలె

క్టరుగారు స్వయంగా చెప్పినసంగతి వినండి. బొటనవ్రేలిగుర్తు వేసిన అర్జీలు ఆయనకు వస్తాయి. ఆయన చదువుకుంటాడు. పార్టీలను పిలుస్తాడు. నీ అర్జీవచ్చింది. నీవు వ్రాయించింది యిదేగదా అని వున్నసంగతి అడుగుతాడు. అనేక పర్యాయములు అర్జీదారు బిక్కమొగము వేస్తాడు. "దేవరా! నేను చెప్పిందొకటి యిందులో ఉండేదొకటండి. రక్షించండి" అంటాడు. అర్జీ వ్రాసేవానికి అర్జీదారుని కష్టసుఖాలు అర్థం కాకపోవడము అట్లుండగా అర్జీ వ్రాసేవాడు యితరత్రా చేసే పొరపాట్లుకూడ అక్షరాలు రానివార్ని కొంపతీస్తాయి. యింకా చదువను, వ్రాయను నేర్చుకొమ్మని బలవంత పెట్టవలయునా?

(ఈ) యీ దినములలో వాళ్ళెక్కడ తమకు సంబంధించిన వృత్తి, వ్యాపారము, కళ, పరిశ్రమ వగైరాల సూక్ష్మవివరములు, అందులో కలుగుతుండే అభివృద్ధులు, అప్పటికప్పుడు తెలుసుకోడానికి చదువురానిదే మార్గమేలేదు. యుద్ధానికి వడ్రంగులను, కమ్మరులను, దర్జీలను, చర్మకారులను నౌకరీలకు పిలిచినప్పుడు, ప్రభుత్వమువారు చదువనూ, వ్రాయనూ నేర్చుకున్నవారినే తీసుకున్నారంటే ప్రతి దిన చర్యకు చదువు, వ్రాత యెంత అవసరమని వారు తలచినారో స్పష్టమవుతున్నది.

మేలుతరమైన పౌరుడుగా వ్యవహరించుట

(అ) చక్కని ఆరోగ్యస్థితిని కలిగియుండడం, ఘోరమైన అంటువ్యాధులను తప్పించుకొనడం, అకాలమరణం

తప్పించుకొనడం, శిశుమరణములను తగ్గించుకోవడం మనకు అత్యవసరము. వ్యక్తిగతంగా పరిశుభ్రంగా వుండుటకు మన దేశంలో అనేక ఆచారా లేర్పడివున్నవి. వుషఃకాలమున నిద్రలేచుట, వేగాలు తీర్చుకొనుట, దంతధావనము, స్నానము, సకాలభోజనము, సకాలనిద్ర యివన్నీ మనపెద్దలు చెప్పినారు. అయితే నేటిదినము వీటిని పాటించడములో దోషాలు కలుగుతున్నవి. అదీకాక యివి అన్నికులాల వారికీ, అన్ని వర్ణములవారికీ అన్వయం కావడంలేదు. కాబట్టి యీ విషయంలోనూ మనము విజ్ఞానాన్ని మన గ్రంథ సామాగ్రినుండిగాని, బయటనుండిగాని వివరంగా తెలుసుకోవలసి యున్నది. మన పరిసరాలు, గ్రామాలు, పట్టణములు, ప్రాంతాలకు మొత్తముమీద పారిశుద్ధ్యము సాధించ వలయుననీ, అందుకు తగిన పౌరసత్వపు జవాబుదారీ కనుపరచవలయుననీ మన భావంలో లేనేలేదని చెప్పవచ్చును. ఉదా :— (1) మన పట్టణవాసాలలో, పల్లెటూళ్లలో కూడా మనయింటి పిల్లలను మలమూత్ర విసర్జనకు మన యెదుటి యింటివారి ప్రక్కలో కూర్చోపెట్టడం ఆచారమైనది. ఆ యింటి భాగ్యశాలి యిదే ఆచారాన్ని అమలులో పెట్టుతున్నది. యీరీతిగా మనకూ గబ్బే, వారికీ గబ్బే.

2. మనదేశంలో జిల్లా గ్రామాలలో స్త్రీలు మల విసర్జనకు యేరాత్రులలో వెళ్లడం, గుంజిళ్లు పెట్టడం అనుభవించికూడా మన పంచాయతులలోని పరిపాలకులు గ్రామములలో స్త్రీలకైనా పాకీదొడ్లు కట్టించడంలేదు. కట్టించినా అజ్ఞానంకొద్దీ ప్రజలు యీ దొడ్లను వుపయోగించుకోక పోవ

డమూ, వుపయోగించినా సక్రమంగా వుపయోగించక రొచ్చు, అసహ్యాము కలిగేటట్లుగా వుపయోగించడమూ వాడుక అయిపోయినది.

ఇట్టి పరిస్థితులు కలిగిన మీాదట గ్రామాలలో ఆరోగ్యంగా వుండమంటే వుండడం సాధ్యమా? నెత్తిన నోరు పెట్టుకొని అరచుకుంటూ యీ విషయములు ప్రజలకు నచ్చచెప్పటం సాధ్యమా? స్త్రీలను, పురుషులను అందరినీ అక్షరాస్యులను చేసి యెక్కడ తిరిగితే అక్కడ కంటికి కట్టినట్లుగ కనిపించినట్లు ఆరోగ్యవిధులు ప్రకటిస్తేతప్ప యీ దుస్థితి త్వరలో మానదు.

(ఆ) వోటు అధికారపు సద్వినియోగం జరుపుటకు అక్షరాస్యత అవసరం. నోరులేని జనసామాన్యము యెవరో కొందరు అక్షరాస్యులకో, లేక పన్నులిచ్చుకునే ద్రవ్యవంతులైన స్వల్పసంఖ్యాకులకో లోబడి భంగముచెందుతుండడము సహింపరాని సంగతి. నేటిదినము ప్రపంచము ప్రజాసత్తాకమని యే రాజ్యవిధానాన్ని కోరుచున్నదో, ఆ రాజ్యవిధానములో నీచాతినీచ స్థితులలో పుట్టిన వ్యక్తికూడ వుత్తమ రాజ్యాధికారమునకు వచ్చుటకు అవకాశ ముండవలెను. తిండికి, గుడ్డకు, చదువుకు మొదటిలో ఆస్కారములేక సాధారణమైన కూలిపనిచేసి బ్రతికిన 'లింకను' చదువుకొని మెట్టు మెట్టుగా పైకెక్కి అమెరికాలో రాజ్యమునకు అధ్యక్షుడైనాడు. ~~యీ దినము~~ రష్యాలో నియంతగాఉండే స్టాలినూ యీ మోస్తరువాడే. ఇంగ్లాండులో ప్రధాన మంత్రిగా

వుండ్నే అట్లీకూడ మొదట కూలివాడే. వీరికి చదువులే లేక పోతే వీరిపేరే వినియుండము.

(౩) ప్రతివ్యక్తికినీ తనబిడ్డలను మంచిపౌరులుగాచేసే అవకాశ ముండవలయును. అక్షరాస్యులైన తల్లిదండ్రుల బిడ్డలు యెప్పుడూ నిరక్షరాస్యులుగా వుండరు. యెందువల్లనంటే తల్లిదండ్రులు అక్షరాస్యులైనపుడు యింటి వాతావరణము చదువుల వాతావరణంగా యేర్పడుతుంది. యింటిలో యీ వాతావరణము లేక బడిలో చదువుకొని యింటికివచ్చి చేరితే వారి చదువుకు దోహదం లేక మళ్లీవారు నిరక్షరాస్య వర్గంలోనికి జారిపోవుదురు. యిప్పటికీ మనదేశంలో పుస్తకాలు, పత్రికలు - అవే అననేల, చదువునేర్పిన మానవుడే లేనివూళ్ళు వున్నవంటే తల్లి దండ్రులకు చదువురాని కారణం చేత అంధకారం యెంతదట్టంగా పేరుకొన్నదో స్పష్ట మవు చున్నది.

జీవితానందం

ప్రాచీనకాలములో రుషులుండిరి. మతకర్తలుండిరి. శాస్త్రజ్ఞులుండిరి. కవులుండిరి. వారందరూ అనేక రీతులుగా అనేక విషయాలను గురించి పద్యాలు, గీతాలు, నాటకాలు, పురాణాలు యిట్లాటివి యెన్నెన్నో వ్రాసి లోకానికి అందించిరి. యివన్నీ చదువుకొన్నవారు యెంతో ఆనందపడుతూ వుంటారు. యిట్లాటి పెద్దలు యిప్పటికాలములోనూ వున్నారు. వీరుకూడ వారివారిమ్రాతలో యింపుగా సొంపుగా విషయాలు లోకానికి తెలుపుతున్నారు. యివన్నీ చదువుకొని

సంతోషించడానికి అవకాశ ముండవలెను. రామాయణము, కొరాను, భగవద్గీత, అధవా నక్షత్రముల వర్ణన ఇవి చదివి ఆనందము అనుభవించుటకు యేమానవుడు అనర్హుడు? మరి యెవరో వచ్చి వాటి సంగతి చెవిలో వూదేవరకో, చెవి కందే టట్లుగా పాడేవరకో కాచుకొని వుండనేల? పుస్తకములు లేని కాలంలో యేదో జరిగిపోయినదంటే అది వేరుమాట. ఈ వేళ యెక్కడపడితే అక్కడే పుస్తకాలు మనకు దొరుక గలవు. నిజమాలోచిస్తే యేయెండాకాలపు చదువో చదువు కొన్న పురోహితుని కంటె, పౌరాణికునికంటె, పరుగులు పరుగులుగా సాగిపోయే వుపన్యాసకుని కంటె పుస్తకములు క్షేమకర సాధనములు గావా? కొన్ని వారాలపాటు చదవ డానికి, వ్రాయడానికి నేర్చుకొన్నట్లైతే బ్రహ్మాండమైన ఈ విజ్ఞానసంపదనంతా వ్రాతమూలకంగానో, అచ్చుమూలకం గానో మానవుని కంటికి ప్రత్యక్షమవుతున్నది గదా? అట్లా ప్రత్యక్షంగా కలిగే ఆనందం అందరూ అనుభవించవద్దా?

బీదసాదలు చెమటోడ్చి సంపాదించి యిచ్చిన పన్ను డబ్బులలోనుంచి లక్షలకొలది ఖర్చుపెట్టి మనమూ, మన ప్రభుత్వాలూ యేర్పరుస్తూవుండే వస్తుప్రదర్శనాలు, ప్రదర్శన శాలలు వీటినిగురించి ఒక్క నిమిషం ఆలోచించి చూడండి. అక్కడ ప్రదర్శించిన వస్తువులను చదువురాని ప్రేక్షకుడు ఆశ్చర్యంతో నోరు తెరచుకొని అర్థరహితంగా యెగాదిగా చూడడానికంటె, యెక్కువ యేమైనా. ఫలము కలుగుతూ వున్నదా? ఇతర వివరములు తెలుసుకోగలిగినా, లేక పోయినా, అధమం ఆ వస్తువుల ప్రక్కన పేళ్లు వ్రాసిపెట్టిన

చీటీలనైనా ప్రేక్షకులు చదువుకో గలుగుతున్నారా? ఇట్టి సంస్థల సత్ప్రయోజనము సాధించడానికైనా మన ప్రజలను చదువరులను చేయవలదా?

ఇతర ప్రయోజనములు

మానవుడు అక్షరాస్యుడైతే ఇంకా యెన్నెన్నో ప్రయోజనములు పొందవచ్చును.

(i) పత్రికలు చదివి అనుదిన వార్తలు తెలుసుకో వచ్చును. అప్పుడు గాలివార్తలు విని బాధలు పడనక్కర లేదు.

(ii) కథలు చదువుకొని ఆనందపడవచ్చును.

(iii) సినిమాకు ప్రతిదినంపోవడానికి మానవుడు అభ్యాస పడినాడు కదా. అక్కడ తెరమీది బొమ్మలను చూడడంతో కూడ దానిమీద వ్రాసిన వ్రాతను చదివి సినిమాచే యెక్కువ ఆనందమును అనుభవింపవచ్చును. ఆ సందర్భములో అచ్చయిన పాటలను చదువుకొని పదేపదే తాను పాడి సంతోషపడవచ్చును.

ఇట్టి వివరములు అనంతంగా చెప్పుటకు వీలున్నది.

# 3. వయోజనుల మనస్తత్వము

వయోజనులకు అక్షరాస్యత నేర్పించి విజ్ఞానాన్ని, వికాసాన్ని వారు పొందగల్గునట్లుచేసే వుద్దేశముతో బోధకు పూనుకొనే మనము వయోజనుల మనస్తత్వమును యెరిగి ప్రవర్తించవలసి యుండును. మన మనస్తత్వమును కూడా మనము గుర్తించ వలసియుండును. మనము పండితులైతే చాలదు. పిల్లలకు చదువు నేర్పడానికి శిక్షితులై వుండిన చాలదు. పిల్లల మనస్తత్వమునకు, వయోజనుల మనస్తత్వమునకు చాలభేద మున్నది. పిల్లలు అప్పుడే ప్రపంచములోనికి వచ్చినవారు. వయోజనులు కొంత అనుభవము పొందినవారు. పిల్లలకు జ్ఞాపక శక్తి యెక్కువ. వారిబుద్ధి పెరుగుట కారంభించినది. వారి మెదడు కలుషితము కానిది. ఏ విజ్ఞానస్వరూపము దాని మీాద ముద్రించవలసియున్నా ముద్రించుట కనుకూలమైనది. పిల్లలకు సంవేదనలు లేవనికాదు. సుఖము, దుఃఖము, గౌర వము, అవజ్ఞత ఇవన్నిటినీ వారు అనుభవింతురు. కాదన రాదు. అయితే రెండవక్షణముననే వారివిషయములను త్రోసి పుచ్చి గంతులువైతురు. వారికి కుటుంబ భారము వుండదు. పోషణకు సంపాదన చేయవలసిన అవసరములేదు. విజ్ఞానము సముపార్జించడము, ఆటలు ఆడుకోవడము ఇవి రెండే వారి పనులు.

పిల్లలకు పెద్దలకు భేదము

ఇక వయోజనుని మాటో? అంటే షుమారు 16 యేండ్లు మించినవారి మాట. పిల్లల సందర్భంలో చెప్పిన పరిస్థితులు ఈ వయస్సు వచ్చినప్పటికి తారుమారై పోవుచున్నవి. పిల్లతనములో వున్నంతటి జ్ఞాపకశక్తి వయస్సు ముదరగా వుండదు. బుద్ధి బాగావికసించి వుంటుంది. మరి పెంపుదల శీఘ్రగతిలో వుండదు. కాని అనుభవముతో పెరిగి పేరుకొనినసంగతులను యేర్చి వర్గీకరించి పెద్దలు అనుసంధించుకొనగలరు. అంటే ఆలోచించగలరన్నమాట. కాబట్టి యేదోవాక మూసలో పోసి స్వరూపము తీర్చడానికి ప్రయత్నిస్తే యితడు తిరుగుబాటు చేయగలడు. అంతేకాదు, ఇతని సంవేదనలు కూడా వేళ్ళుపారి పాదుకొనియుండును. సులభముగామార్చుట సాధ్యంకాదు. గౌరవము, అవజ్ఞతలు చప్పున యితనికి అనుభవమునకు వచ్చును. మరియే సంవేదనకూడా యింత బలవత్తమంగా వయోజనుని చలింపజేయదు. మరియొక విశేషము. వయోజనుడు సంసారచక్రమున పూర్తిగా పరిభ్రమించువాడు. తిండికై ప్రొద్దుపొడిచింది మొదలు సూర్యాస్తమయమువరకు చెమటోడ్చి పనిచేయవలసినవాడు. కుటుంబ నిర్వహణకు జవాబుదారీ మోయువాడు. సంఘజీవితములో సంబంధ బాంధవ్యములు తీర్చవలసినవాడు. మనము ఆలోచించునది విద్య విషయము.

కాబట్టి యింకొక సంగతికూడా గమనించతగును. పిల్లవాడికి గల పదముల యెరుక చాలాతక్కువ. వయోజనునికి జీవితములో తాము యెదుర్కొన్న అన్ని సమస్యలకు సంబంధించిన భాష అంతయు తెలిసినది. సత్యమేమనగా అతడు తనజీవితము చేతనే శిక్షణ పొందినవాడు. అతనికి చదువను, వ్రాయను నేర్పుటకు సిద్ధపడే మనము వొక్కొక్కప్పుడు అతనికంటె తక్కువ జీవిత శిక్షణ కలవారమేమో? అతనికి మనము యిచ్చే క్రొత్తశిక్షణ చాల యెక్కువదని అనుకొన డానికి వీలేలేదు. అతనికి అనుభవములోవున్న శబ్దములు వ్రాతలో పెట్టితే యేరూపము ధరించునో ఆ రూపమును గుర్తింపజేసే ప్రయత్నమే మనము చేయు ఘనకార్యము. అంటే శబ్దములను చిత్రించే గుర్తులు, ఆగుర్తుల కూడికలు, అక్షరములు, పదములు, వాక్యములు అనేపేరట అతనికి నేర్పుతున్నాము.

పైన చెప్పిన దానినిబట్టి మొదట మనకు తేలునదేమంటే వయోజనుడు తన అనుభవముచేత పొందిన భావములను సమయానుకూలంగా, మానసికంగా, జోడించుకోగలడు. దీనికి మన శాస్త్రవేత్తలు వొక పేరు పెట్టుకొన్నారు. ఆ పేరుతో మనకు ప్రసక్తి అక్కరలేదు. భావముల జోడింపు అనే వ్యవహారించుకొందాము.

దీనికొక యుదాహరణము :— మన వద్దకు చదువను, వ్రాయను నేర్చుకొనుటకై వొక వడ్రంగి వచ్చినా

డనుకొందాము. ఓకుమాను బొమ్మనొకటి ఆయన యెదుట పెట్టినాము. వెంటనే అది ఓకని అతడు గ్రహించగలడు. ఒకవేళ ఓకుమాను అతడు చూచియుండని పక్షమునకు అతనికి యిది ఓకుమానని చెప్పడముతోనే అనేక అనుభవ ములు వొకటి వెంబడి వొకటి మనస్సునకు స్ఫురించును. ఓకుకోత, ఓకుకలపను చదును చేయడం, పలకలను అను సంధించడం, ఓకుకర్రకుగల గుణములు. యితర కర్రల లోపాలు వగైరా పదులు, నూర్లకొలది భావాలు అతని మనోవీధిని విహరించును. పసిపిల్లలైనచో ఇట్టిదేదీ సంభ వించదు. అది ఓకుమానని పేరు చెప్పడముతో ఆరంభించి దాని వుపయోగములు, ప్రయోజనములు, వొక్కటొక్క టిగా చెప్పిగాని, చూపిగాని వారికి బోధచేయవలసియుండును. అదే వయోజనుడు బెస్తవాడైనచో యీ ఓకుమాను బొమ్మ చేత యేవిధమైన భావపరంపరయు అతనికి పుట్టదు. అతని కథ అంతా పడవలు, వలలు, చేపలు, సముద్రము వగైరా లకు సంబంధించినది. కాబట్టి వయోజనులకు విద్యనేర్పేవారు యీ మనస్తత్వ ప్రాబల్యాన్ని గుర్తించడం అవసరము. వారి వారి అనుభవములను బట్టి వయోజనులకు వొక్కొక్కరికి వుండగల భావములను జోడించు శక్తి యిట్టిది కావచ్చునని బోధకుడు గ్రహించితేనే, నేర్చుకొనువారి శ్రద్ధాభక్తులను చక్కగా పురిగొల్పి, తాను నేర్పే విషయముమీద వారి దృష్టిని నిలిచేటట్లుగా చేయవచ్చును. అంటే ప్రతివ్యక్తికి బోధచేయడములో ఆతని జీవితశ్రద్ధ యెచ్చటకలదో కనిపెట్టి దానిని వినియోగించుకొనుట అవసరమన్న మాట. అందు

చేత యీ భావములజోడింపు అనే మనస్తత్వములోని ఒక్క అంశమును పూర్ణముగా వినియోగించుకోవడముతో మనము హారములో కొక్కికి కొక్కి కూర్చినట్లు, విషయమునకు విషయమును కూర్చి విజ్ఞానాభ్యర్థికి చక్కని ప్రబోధమును కల్పించవచ్చును. ఈ అంశమును మనము యెంత పరిపూర్ణముగా వినియోగించుకొందుమో, అంత పరిపూర్ణ ఫలమును మన కృషిచేత సంపాదించ వచ్చును.

## పెద్దల జీవిత సందర్భాల ప్రాబల్యం

ఈ కారణముచేత వయోజనులకు చదువు, వ్రాత నేర్పించుటకు వారివారి జీవిత సందర్భాలననుసరించి శిక్షణ పథకాన్ని తీర్చడం వుత్తమపద్ధతి. ఇచ్చట వొకప్రశ్న కలుగవచ్చును. చదువు నేర్చుకొనుటకు వచ్చే వయోజనుడు దినమంతా తాను చేసేపనిలో మునిగి తేలివచ్చేవాడుకదా! మళ్ళా అదేకృషిని యీ చదువులోకూడా అతనిమీద గుద్దితే అది బాధ కలిగించదా? దానికి ఒక్కటే ప్రత్యుత్తరము. పనిచేసి అలసినవాడిచేత మరల పనిచేయించమని అర్థముకాదు. పనిలో అతనికి పరిచయమైన భావపరంపరను కౌశల్యముతో వుపయోగించుకొనవలసినదని యిందులోని సూక్ష్మము. అప్పుడు ఆ స్మరణ బాధగా పరిణమించుటకు బదులు, ఆనందముగా పరిణమించే పరిస్థితులు కలుగును. ఈ విషయమున మరియొక అభిప్రాయమును గలదు. మానవుడు పనిమీద వున్నప్పుడే ఆపనికి సంబంధించిన పదజాలమును వినియోగించి అచ్చటే అక్షరాస్యత కలిగించవలయునని

కొందరందురు. అట్టిది అధికారేతర ప్రయత్నములో సాధ్యము కాని పని. ప్రభుత్వము పూనుకొని, యజమానులను బలవంతపెట్టి వారు చేయించుకునే పనుల కాలములోనే కొంత కాలము చదువు, వ్రాత నేర్పించుటకు ప్రత్యేకపరచ వలసిందని నియమింపగలిగితే ఇట్టి ప్రయోజనము సాధించుటకు వీలగును. అప్పుడు వుత్పత్తిచేయడం కొంత కొరవడి, కర్చు హెచ్చి వస్తువు ప్రియముగా అమ్మడమూ, అంతమొత్తమూ యిచ్చి కొనుగోలుదారులు కొనడమూ జరుగవలసివచ్చును. ఇవన్నియు ప్రభుత్వమువారి వుత్తరువులచే సాగవలసియుండును, అంటే పరిపాలన నిర్బంధమో, ఐచ్ఛికమో అయిన సోషలిస్టు సిద్ధాంతముల మీాద నడుపవలసివచ్చును. ఇట్టి పరిస్థితులను కల్పించవలయుననే దీక్షతోనే మన దేశనాయకుడైన గాంధీజీ కార్యనిర్వహణము చేసినాడు. ఇది ప్రస్తావవశమున వచ్చిన ప్రశంస.

### కార్య కారణ సంబంధము

వయోజనుడు పిల్లలకంటె యెక్కువగా కార్యకారణ సంబంధములను జోడించుకోగలడు. తగినంత ఆచూకి దొరికితే తర్కవితర్కము చేసుకొని ఫలము తేల్చుకోగలడు. ఇతడు పిల్లలవలె అమాయకుడు కాడు. తూచి ఆలోచించువాడు. ఇతనికి చదువునేర్పడానికి బయలుదేరే బోధకుడు బహుజాగ్రత్తగా మెలగవలెను. ఏవిధమైన వ్యతిరేకత్వము యితని మనస్సులో కలుగ నివ్వరాదు.

### కించిజ్జ్ఞత

చదువు నేర్చుట అనే క్రియ ఎల్లప్పుడూ చిన్నపిల్లలకు సంబంధించినదిగా సాధారణ వ్యవహారముండబట్టి "అబ్బే! నేనేమి పిల్లలతో సమానమా? ఈ చదువుకునేపని నా కెందుకు?'' అనే కించిజ్జ్ఞత వయోజనుణ్ణి బాధిస్తుంది. ఇది ఒకొక్కప్పుడు చాలా బలీయంగా వుంటుంది. రహస్యంగా తప్ప పదిమందిలోకూర్చుని చదువుకోడానికి మనస్కరింపని వయోజనులు తటస్థపడతారు. అట్టివారికి కించిజ్జ్ఞత పోగొట్టడానికి చదువునట్టి అభిలాష బలపడేవరకు చాటుమాటున అక్షరాస్యత కల్పించడమే మంచిది. ఈకించిజ్జ్ఞతచేతనే మరియొక విపరీతము కలుగుచున్నది. తాను తప్పుచేసినాడని అనిపించుకోవలసివస్తుందేమో అనే భీతి ఉద్భవిస్తుంది. ఈ వుపాధ్యాయుని కనుబొమలముడి, పెదవుల విరుపులు నే నెందుకు అనుభవించవలయునని అతడు వెనుదీస్తాడు. ఇట్టివే ఇంకా అసంతోషకరమైన అనుభవములు యెన్ని తాను పొందవలసి వచ్చునో అని భయపడుతాడు.

### ప్రతిష్ఠ దృష్టి

ఈ కించిజ్జ్ఞతతో సమమైనదే దీనికి కేవలము విరోధముగా తోచే ప్రతిష్ఠదృష్టి వయోజనుని యందుంటుంది. తాను యజమాని అనేభావం ప్రతివాడికీ కలదు. అధమపక్షం తానుకాచే గేదెలు, దున్నపోతుల మీదనైనా పనులకాపరికి నాయకత్వం వున్నది. కాబట్టి యింకొకడు తనకు నాయకుడై, యజమానియై చదువులలో నడుపుతాడంటే

అతి సామాన్యుడైన వయోజనునికి కూడా మనసొప్పక పోవచ్చును.

ఈ విధమైన కించిజ్ఞతలు, ప్రతిష్ఠలు అనే పరస్పర విరోధగుణాలకు లోబడి వయోజనుడు చదువుట నేర్చుకొనమంటే యేవేవో సాకులు చెప్పి తప్పించుకొనడానికి విశ్వప్రయత్నము చేస్తాడు. "కాటికి కాలు చాచినవాడికి నాకెందుకు చదువు?" అంటాడు. "యిది వస్తుందా చస్తుందా? నన్నెందుకు బాధపెడతావు" అంటాడు. యింకా పరిపరివిధాలైన తప్పుకునే మార్గాలు వెతుకుతాడు. కాబట్టి దీనికంతటికి ప్రతీకారము చేసుకునే వుపజ్ఞత బోధకునిలో వుండవలయును.

బోధకుడు ముఖ్యంగా వయోజనుల విశ్వాసాన్ని సంపాదించుకోవలయును. చదువులంటే వారియందు ఆశను రేకెత్తించవలయును. దీనికి బోధకుని ప్రేమప్రవృత్తియే నిజమైన ప్రధానాధారము. తాను తనశిష్యుడుగా యెంచుకోదగిన వయోజనుని జీవితంలోనికి అల్లుకొనిపోయి అందులో భాగమై, లీనమై ఆ యాత్మను పైమెట్టుకు చేరడానికి పురికొల్పేశక్తిగా యేర్పడవలయును. ఆయాత్మపై తానీరాజ్యము వహించడములో ఆ యాత్మను తనకు రాజుగా భావించుకోవలయును. ఆ వయోజనుని మనస్తత్వాన్ని అనుసరించే అతనిని తీసికొనిపోతూ అతనిదృక్పథంలో పరివర్తవము తీసికొనిరావలయును. అతనిలో కొద్దితేజము కనిపించినా "సెబాష్" అని ప్రోత్సహించవలయును. అతడు చేసే తప్పులు యేమైనావుంటే తాను గమనించుకోవలయును గాని

వాటిని అతడు మనస్సు నొచ్చుకునే రీతిగా ఆక్షేపించరాదు. గుణములను పాటించడం, ప్రేమార్ద్రహృదయముతో లోపములను అప్రత్యక్షముగా దిద్దడం వుత్తమమార్గం.

## కష్టజీవితాన్ని ఆనందప్రదం చేయవలె

వయోజనుని పరిస్థితులలో ప్రధానంగా గణింపవలసిన సందర్భము యింకొకటి కలదు. సాధారణంగా మనము చదువులు నేర్పించవలసిన వారందరు కష్టజీవులు. వారుచేసే శ్రమ, వారుపడేపాట్లు వారి జీవితానికి చాలునని అనిపిస్తూ వుంటుంది. వారికి విరామము చాలా తక్కువ. ఆ స్వల్ప విరామములో చదువు నేర్పవలసిన దుర్గతి మనకు తప్పదు. మళ్లీ యీ చదువు అనేది వొకపనిగా బరువుగా యేర్పడి పోతే దీనివల్ల మనస్సుకు ఆయాసము కలిగేటట్లు వుంటే ఇది ఫలించదు. కాబట్టి వయోజనులకు చదువు నేర్పించడానికి ప్రయత్నపడే బోధకుడు ఆ చదువును ఆనంద ప్రదముచేయవలయును. ఆటల పాటలక్రింద సాగించవలయును. యేదోవొక పాఠము చెప్పుతూవుండి ఆ మధ్యలో విద్యార్థికి విసుగు కలుగుతూవున్నదని తోస్తే వెంటనే యే కథనో, చిత్రప్రసంగాన్నో అందులోనికి ప్రవేశపెట్టి అతడు ఆనందపడేటట్లుగా చేయుట విధి.

## అనుకూల పాఠ్యక్రమం

పాఠాల క్రమము యేర్పడేటప్పుడే సులభమైన పద్ధతులు, శీఘ్ర మార్గాలు ఆలోచించి పనిచేయడం ఆవశ్యకం. మధ్య మధ్య ఆనంద ప్రదమైన విషయాలు చేర్చుట

అంతకంటె అవసరము. ఈసంగతులు గమనించి బొంబాయి లోని వయోజన విద్యాసంఘంవారు వయోజనవిద్యకు నిర్ణయించుకొన్న రమారమి 1 గంట కాలమును యీ క్రింది రీతిగా విభాగించినారు.

| వరుస సంఖ్య | విషయము | కాలము |
|---|---|---|
| 1 | ప్రార్థన (అంటే సంగీతముతో కూడినది) | 3 నిమిషములు |
| 2 | ఉత్తేజకరమైన సంభాషణ | 10 ,, |
| 3 | కడచిన పాఠపు పునశ్చరణ | 10 ,, |
| 4 | క్రొత్తపాఠము | 15 ,, |
| 5 | హాజరు పట్టీ వేయుట | 5 ,, |
| 6 | చిత్రవిషయ విమర్శనము | 5 ,, |
| 7 | తుది సంగీతము (పాఠము) | 2 ,, |

ఈ పై జెప్పిన కార్యక్రమము హూహూకారంగా నకలు చేసి అమలులో పెట్టవలయునని అనుకోవలదు. ఇందులోని అంతరార్థమును గ్రహిస్తే యెక్కడి కక్కడ మనము యిష్ట మొచ్చిన రీతిగా కార్యక్రిమాన్ని వేసుకోవచ్చు.

యీ సూచనను అనుసరించే పెద్దల చదువు సాగిస్తూ వుండే. అన్ని రాష్ట్రాలలోకూడ పాఠక్రిమాలను తీరుస్తు

న్నారు. మద్రాసు కోస్తాలో యీ క్రింది నమూనా పాఠ క్రమమును సూచించి స్థానికావసరములనుబట్టి మార్చుకో వచ్చునని అనుమతించినారు *.

అలసిపోయిన మనిషికి, ఆయాసపడిన మెదడుకు పాటలు, గీతాలు, యితర సంగీతము వింటే మళ్లీ శక్తి చిగురిస్తుంది. ఉత్సాహము పుడుతుంది. శాంతము కుదురుతుంది. కాబట్టి మన చదువుల కాలక్షేపాన్ని వీటితో ఆరంభిస్తే కష్టపడి విసిగి మన దగ్గరకు వచ్చినటువంటి మనిషికి ఆ కష్టమూ, విసుగూ తుడిచివేసే దోహదముచేసిన వాళ్లమవుతాము. అదేరీతిగా మన కార్యక్రమము ముగించేటప్పుడు కూడా ఆనందము కల్పిస్తే మధ్యన యేదో కొంచెము ఆయాసము కలిగి వుండిన దానిని మరిపించడానికి అవకాశము చేసిన వాళ్లమవుతాము.

హాజరు పట్టీ

పై కార్యక్రమము గంటకూడా ఆక్రమించదు. ఈ విధమైన స్వల్పకాల నియామకమే చాలమంచిది. ఈస్వల్ప కాలంలోను హాజరుపట్టి వేయడం మధ్యకు త్రోసిపెట్టడం గమనింపదగును. ఇది యెందువల్ల యేర్పడిన దంటారా? వయోజనుడు ఒక్కొక్కప్పుడు వేళతప్పి రావడము సంభవిస్తుంది. ఆ కారణముచేత అతడు రాలేదని గైరుహాజరు వేస్తే నిరుత్సాహం జనింపవచ్చును. వయోజనుడు విరామ

* ప్రక్క పేజీలో కానవగును.

5

| రాత్రి | 7-7.5 | 7.5-7.30 | 7.30-8 | 8-8.30 |
|---|---|---|---|---|
| సోమవారము | సమూహగానం | వ్యక్తిగతమైన వ్రాత, చదువులు | ఒకక్కనికిమరొక్కరు చదువు చెప్పడం | ప్రపంచజ్ఞానము |
| మంగళవారము | ,, | ,, | ,, | వర్తమాన విషయాలపై చర్చ |
| బుధవారము | ,, | ,, | ,, | ప్రపంచజ్ఞానము |
| గురువారము | ,, | ,, | ,, | ఉద్గ్రంథపఠనము |
| శుక్రవారము | ,, | ,, | ,, | లెక్కలు |
| శనివారము | ,, | ,, | ,, | భజన కాలక్షేపం లేక నాటకవినోదం |
| ఆదివారము | | —సెలవు— | | |

కాలాన్ని యెంత వుత్సాహముతో వినియోగించుకోన వచ్చునో, అంత వుత్సాహాన్ని పురికొల్పడము బోధకుని ధర్మం. కాబట్టి సాధ్యమయినంతవరకు నిరుత్సాహపరిస్థితులు కలుగకుండా యితడు కార్యసాధన చేయవలయును. పైకార్య క్రమములో రెండవ అంశమున్నూ, ఆరవ అంశమున్నూ యిందుకొరకే చేర్చడము జరిగినది. కాబట్టి ఆ రెంటిని యెంత తేలికగా, యెంత ఆహ్లాదకరంగా తీర్చవలయునో, అంత తేలికగా అంత ఆహ్లాదకరంగా తీర్చడము అవసరం. అతి ఆకర్షణీయమైన లోకవార్తలు, వ్యవహారములు యెప్పుడూ వుండనే వుంటాయి. కాబట్టి యీ రెండుఅంశాల సందర్భమున వీటిని వినియోగ పరచుకోవడం చాలా ప్రయో జనకరము. కథలు, హాస్యగోష్ఠి వగైరాలుకూడా చాలా బాగా తోడ్పడుతాయి.

### ప్రాతపాఠపు పునశ్చరణ

పై కార్యక్రమములో ప్రాతపాఠపు పునశ్చరణ అనేది వొక అంశంగా యేర్పడివున్నది. దీని ప్రయోజనముగొప్పది. దానిని తెలిసికోలేక సాధారణంగా బోధకులు యీఅంశాన్ని వదలివేస్తుంటారు. అథవా యెవరైనా దీనిని అమలులో పెట్టినా బోధకుడే స్వయంగా యీ పునశ్చరణ చేస్తుంటాడు. ఇది పొరపాటు. నేర్చుకునేవారికి తమకు జ్ఞాపకమున్న విష యాలు చెప్పమని వారిచేత పునశ్చరణ చేయిస్తే విషయము బాగా మనస్సులో నాటుకొంటుంది. చెప్పినది అంతా సమ గ్రంగా వొక్కరే పునశ్చరణ చేయలేరన్న మాట నిజమే. కాని వున్న నలుగురు నాలుగు సంగతులు చెప్పితే పునశ్చరణ

అవుతుంది. వారు వేరు వేరు సంగతులను చెప్పుతారనడం కూడా నిజమే. బోధకుడు చెప్పే విషయాలలో సాధారణముగా వారి వారి భిన్నరుచులను అనుసరించి నేర్చుకొనేవారు యేదో వొక భాగమో, అర్ధభాగమో గ్రహిస్తారు. అందరి అభిరుచులమీద గ్రహించిన విషయాలన్నీ చెప్పేవరకు పూర్ణమైన స్వరూపం దానికేర్పడుతుంది. కొరవవుంటే వుపాధ్యాయుడు పూర్తి చేయవచ్చును. పునశ్చరణ అంటే ప్రశ్నలు వేస్తూ పెద్దలను విసిగించడమని అర్థముకాదు. సాధారణంగా ప్రశ్నలు వేయడం మానుకొని ఆనందకర ధోరణితో వారి వద్దనుండి విషయములు రాబట్టవలెను. వారుబిక్కమొగము వేసే సందర్భం యెప్పుడూ కలుగరాదు.

ఫలాపేక్ష

సాధారణంగా వయోజనులు యేపనికి పూనుకున్నా "ఇందువల్ల నాకేమి ప్రయోజనం?" అని ప్రశ్న వేసుకోవడం సహజం. కాబట్టి చదువుకోసరం చదువుకోవయ్యా అంటే యెవరూ చదువుకోడానికి సిద్ధముకారు. నిజానికి చదువుకోసరమే చదువునేర్పడంకూడా జరుగదు. చదువులోనే ఫలోద్దేశం యిమిడివున్నది. అందుచేత బోధకుడు చదువు, విజ్ఞానాల ప్రయోజనాన్ని గురించి చదువుకొనేవారిని తృప్తిపరచగలవాడు కావలయును. బళ్లో చదువుకోకుండా తమంతటతాము కష్టపడి విద్యనేర్చి ప్రపంచములో ప్రఖ్యాతులైన పెద్దల జీవితాలను బోధకుడు సేకరించి పెట్టుకొనవలయును. (1) అబ్రహాంలింకను (2) బూకరు టి. వాషింగ్టను (3) అనీబిసెంటు (4) బి. వి. నాథ్ (5) జి. డి. నాయుడు వగైరా యెన్ని

పేర్లైనా స్మరణకు వస్తాయి. అక్షరాస్యుడు కాని వాడికి కలిగే కష్టాలను ప్రదర్శించే పటాలను సంపాదించి పెట్టుకోవడం మంచిది. అర్థికంగా చదువుకున్నవాడు యెట్లు బాగు పడుతున్నాడో ప్రస్తావించడంకూడా అవసరం. వ్యవసాయం, ఆరోగ్యం, వ్యాపారాలు, వయోజనుల వృత్తులు - వీటికి సంబంధించిన రహస్యములు అక్షరాస్యతవల్ల యెట్లు తెలిసికోవచ్చునో ఆ రహస్యముల వివరణచేస్తూ తెలియపరచవలయును. తన చేవ్రాలు తాను చేయగలిగిన మనిషి అంతమాత్రముతో గూడా యెట్లా ఆనందపడగలడో వివరించ వచ్చును. నిజంగా చదవడం, వ్రాయడంలో చేవ్రాలు చేయడమనేది క్రింది మెట్టులలో క్రిందిమెట్టు. యిక చదువు, వ్రాతలవలన లభించే వోటుప్రయోజనము, బాధ్యతలను గురించి ప్రసంగించవచ్చును. అన్నిటికంటె మేలైన ప్రయోజనం తన పిల్లలకు తాను అక్షరాస్యతచే బాగా వుపయోగపడ గలడనడం వయోజనునికి రుజువుచేయవలయును. అతడు చదువులు నేరిస్తే అతనిపిల్లలు యెప్పుడూ నిరక్షరాస్యులుగా వుండరనేది అతనికి నచ్చజెప్పవలయును. తల్లిదండ్రులు చదువరులైతే చదువుల వాతావరణం ఏర్పడుతుంది. బళ్లో చదువుకొని వచ్చిన పిల్లలు చదువులు మరిచిపోవడమనేది యెప్పుడూ సంభవించదు.

### మానవ ప్రకృతులు

చదువుకొనడానికి సిద్ధమయ్యే వయోజనులు మొత్తము మహాజన సంఘానికి చెందినవారే. సాధారణంగా ప్రజానీకానికి వుండే మొత్తము మనస్తత్వమే వీరిలోకూడా వుంటుంది.

అందువల్ల అందరికీ వర్తించే మనస్తత్వాలుకూడా మనము కొంతవరకు గ్రహించడ మవసరము.

త్రిగుణములు

మన పెద్దలు సాత్విక, రాజసిక, తమోప్రకృతు లని గుణములను బట్టి మానవప్రకృతులను విభజించినారు. యీ విభాగమును నేడు మనముకూడ వినియోగించుకో వచ్చును.

మన దేశములో విపరీత పరిస్థితులు యేర్పడడం చేత సాత్వికమనే గుణముయొక్క స్వభావమును మరచిపోయి నాము. తారుమారుచేసి అర్థము చేసుకొనుచున్నాము. అసలు సాత్విక గుణము మహత్తమమైన శక్తికలది. పూర్ణత్యాగము నకు వెనుదీయనిది. ధర్మనిర్వహణమునకు మరణమునైనను యెదుర్కొనుటకు సిద్ధమైనది. అట్టి సాత్విక ప్రకృతి యీ దినము గాంధీజీ పరిశ్రమచేత పునరుజ్జీవిత మగుచున్నది. కాని సాధారణ వ్యవహారములో సాత్వికుడంటే కొంచె మించు మించుగా చేతగానితనమును ప్రకటించుకునే అనదయనిఅర్థము తీయుచున్నాము. అట్టివారు మనదేశములో చాలామంది వున్నారు. వారిని యేపనికైనా పురికొల్పడము మిక్కిలికష్టము. అందులోనూ చదువుకొనుటకు పురికొల్పుట కష్టతమము. అయినా మోడులు చిగుర్పచేసే సంకల్పబలము మనము వినియోగించి వారినికూడా చదువరులను చేయవలసియున్నది. "యేదోపడివున్నాలే, నాకెందుకు యితర జోక్యాలు" అనే ప్రవృత్తిని మనము యీ దేశమునుంచి పారద్రోలవలసిన ముహూర్తము యేర్పడియున్నది. యెవ్వరినీ నిరక్షరులుగా నుండనీయరాదను దృఢసంకల్పమే మన ఆయుధము.

రాజసప్రకృతులవారు కార్యపరులు. వీరు మనస్సు పెట్టిన పనినిసాధింపను వెనుదీయరు. వీరి చిత్తవృత్తి సమ ధాతువులో నడుచుచుండును. కాబట్టి యిట్టి వారితో మనకు యెక్కువ కష్టము గలుగదు. విచక్షణతో ప్రవర్తించుట వొక్కటే మన పని.

తామస ప్రకృతులతో వ్యవహరించుట నిజముగా కష్టము. వారు పూర్తి చీకటి శక్తులు. తమంతటివారు వుండ రని వారిభావము. మాట్లాడే మాటలో, చేసే పనిలో నేను, నేను, నాది, నాది అని జపముచేయుటే వారి ఆచారము. యే కొద్దిమాట మాట్లాడినా వారు ఆగ్రహింతురు. పల్లెత్తు యెదురాడినా వారికి కోపము వచ్చును. యిట్టి వారినిగూడ మన మార్గమునకు త్రిప్పుకొని చదువుల ప్రచారము చేయ వలసియుండును.

### ప్రయోజనక బోధకుని లక్షణములు

పై చెప్పిన ప్రవృత్తులతో మనము వ్యవహారము జరుప వలయునంటే మన ప్రకృతి వారి ప్రకృతులను మార్చేశక్తి గలది కావలసియుండును. అందుచేత మన ప్రకృతి యెటు వంటిదో మనమే పరిశీలించుకొని సరిదిద్దుకొనవలయును. మనది తామస ప్రవృత్తి యగునా ? అని మొదట ప్రశ్నించు కొందము. యిది నే కనిపెట్టుట యెట్లు ? అని ప్రశ్నించ పని లేదు. మనది తామస ప్రకృతే అయితే మనకప్పుడే తెలిసిపో తుంది. అక్కచెల్లెండ్రతో, అన్నదమ్ములతో, తల్లిదండ్రులతో కస్సుబుస్సు మనడం, చీటికీమాటికీ యితరులమీదఅలగడం, యెప్పుడూ యితరులు మనకు వ్యతిరేకమే చేస్తున్నారని

వూహించుకోడం, వొకరు లాభపడుతున్నారంటే యీర్ష్య పడుతూ వుండడం మనకు తెలియని సంగతులు కావు. మనది యీ విధమైన ప్రకృతి అనేది స్పష్టమైనప్పుడు దీనిని దిద్దుకోకుండా ప్రజాహిత జీవనం చేస్తామని, వయోజనవిద్యా ప్రచారం చేస్తామని బయలుదేరడం సరికాదు. పని జరుగకపోతే కాకిమీదా, గువ్వమీదా నెపాలుమోపి అసంతృప్తి పడటం తప్పే. మనము యింకొకరితో సంబంధము పెట్టుకొనేటప్పుడు మనయంతటివారు వారూ, వారంతటి వారు మనమూ అని ప్రవేశించకపోతే యే కార్యమూ తుదముట్ట సాధించుటే కాదు; కొంతదూరమైనా సాగించ లేము.

మనము రాజసప్రకృతివారమనడముకూడా మనకు తెలుస్తూనే వుంటుంది. కొంత ఠీవి, కొంత నమ్రత, కొంత మర్యాద, కొంత ప్రతిష్ఠ, యివన్నీ మన మనస్సులో గులగులలాడుతూనే వుంటాయి. యిట్టి ప్రకృతితో మనము బయలుదేరితే అట్టే నష్టముండదు. కాని ఒక్కొక్కప్పుడు పరమ సాత్వికస్వభావం అవసరమౌతుంది. యెదుటివాడు లోపము కనపరచినాడు. నేనిక వాడితో సంబంధమే కలుగజేసుకోను, అంటను, తాకను అనే ధోరణిలో ప్రజాహిత జీవులు యెవ్వరూ పడరాదు. యెదుటివాడు చేసినది నిజమైన లోపమే అయినా, నిర్ణయమైన దోషమేయైనా అతని హితమును, లోకహితమును కోరి యేనాటికైనా అతనిని కల్యాణ మార్గమున పెట్టి త్రిప్పగలననే వోరిమి సంపాదించటం అవసరము. నేను చేసేవాడను, యెదుటివాడు ఫలమును అనుభవించేవాడు అనునంతటి మాత్రపు అహంభావము కూడా

వయోజన విద్యాబోధకునిలో వుండరాదు. తనకెంత అవకాశము, స్వాతంత్ర్యము కావలయునని కోరుకుంటాడో, యెదుటివాడు అంతే కోరుకుంటాడనడం, అంతకంటె యెక్కువకూడా కోరుకుంటాడనడం మరువరాదు. తానుతప్పులూ, దోషాలూ చేసినప్పుడు వాటిని యితరులు మరచిపోవలసిందని యెట్లా తాను కోరుకుంటాడో, అట్లనే వారుకూడా కోరుతూ వుంటారనేది జ్ఞాపక ముంచుకో వ ల యు ను. ఈ సందర్భంలో వయోజనునికి బోధచేసేటప్పుడు బోధకుడు అనుసరింపవలసిన ఒక చిన్న విషయము వివరింపదగియున్నది. తాను యెంత కొద్దిగా మాట్లాడవచ్చునో, అంతటితోనే తృప్తిపడవలయును. వయోజనవిద్యా ప్రచారకుడు నోరు తెరువని ముముక్షువుగా వుండడానికి వీలులేదు. కాని వదరుబోతుగానూ వుండరాదు. ఎదుటివానిని వశపరచుకొనే మితభాషిత్వము అవసరమైనా, అతడు స్వతంత్రముగా సోపపత్తిని ప్రకటించడానికి, సంపూర్ణావకాశములు యివ్వడానికి తాను యెల్లప్పుడు వాఙ్నియమము పాటించువాడు కావలయును. బోధకుడు సరసుడనే అభిప్రాయము చదువరికి చక్కగా యేర్పడి బోధకుని వ్యక్తిత్వమునందు అతనికి గౌరవము కలుగవలయును. తాను చురుకుదనము కలిగి స్పష్టోచ్చారణతో మాటలలో జీవకళ వుట్టిపడేటట్లుగా బోధన కార్యము నడుపుకోవలయును.

ఇంతా చెప్పినతరువాత వ యో జ న బో ధ కు డు యెప్పుడూ చింతాక్రాంతుడుగాని, దురాశాపరుడు గాని

కాకూడదనడం వేరుగా చెప్పబనిలేదు. ప్రేమస్వరూపియై విజయసాధన చేయవలయును.

## ద్వంద్వ గుణములు

వయోజనుల ప్రకృతులను గురించి వ్యవహరించే టప్పుడు మరియొక దృష్టిపథమునుంచికూడా విషయ వివర ణముచేయడం అవసర మనిపిస్తున్నది. మానవునిలో గుణము లన్నీ ద్వంద్వప్రకృతి కలవిగా కనిపిస్తున్నవి. పొదుపుగుణము విపరీతమైతే, దురాశ అవుతుంది. శ్రద్ధాభక్తులు విపరీత మైతే మతపిచ్చి అవుతుంది. శిక్షణార్హత విపరీతమైతే గుడ్డి విశ్వాసమవుతుంది. ఇట్లే ఆత్మవిశ్వాసము విపరీతమైతే అహం భావము, చింతన విపరీతమైతే విషాదము, స్వాతంత్ర్యము విప రీతమైతే అరాచకం, సత్యము విపరీతమైతే దౌర్జన్యము, సాధుత్వము విపరీతమయితే దౌర్బల్యము, జాగ్రత్త విపరీత మైతే భీతి, ధైర్యము విపరీతమైతే దుందుడుకుతనము, మర్యాద విపరీతమయితే సంగనాచితనము, ప్రేమ విపరీత మయితే మోహము, సంకల్పము విపరీతమయితే మొండితనము, గౌరవము విపరీతమయితే తొత్తుతనము, ఆకాంక్ష విపరీత మయితే నిష్కారుణము యేర్పడతాయి. ఈ విపరీతగుణములు కలిగిన వ్యక్తితో వ్యవహారము జరుపవలసివస్తే ఆవిపరీత గుణాన్ని సక్రమమయిన సుగుణం క్రిందికిమార్చే విధానంలో మనము ప్రవర్తించడానికి పైన పేర్కొన్న ఆత్మసంస్కరణ ప్రయోజనపడుతుందనడంలో సందేహంలేదు.

### వ్యక్తులపై శ్రద్ధ

ఇదివరకు వివరించిన అన్ని సంగతులను బట్టి వొక్క విషయము స్పష్టమయినది. యెవరికి చదువు, విద్య నేర్ప దలచుకున్నా వారివారి వ్యక్తిత్వానికి తగినట్లుగా మనము శ్రద్ధచూపవలసియున్నది. పిల్లలకు చదువు నేర్పేటప్పుడు కూడా వ్యక్తిగతమయిన సేవ అవసరమేకాని పెద్దల విషయంలో యిది అంతకంటె చాల యెక్కువ అవసరం. కాబట్టి సమూహము మీద తరగతులు పెట్టి జరిపే కార్యక్రమాన్ని రద్దుచేయడం మనము ఆలోచింపరానిదైనా, వొక్కరికి మరి యొక్కరు నేర్పే విధానాన్నే యెక్కువ యెక్కువగా విని యోగించుకోవడం క్షేమతరం. డబ్బు స్కూల బలమూ, ప్రభుత్వాధికారమూ లేక అధికారేతరసంస్థలు వయోజన విద్యాకార్యక్రమానికి జవాబుదారీ వహించేటప్పుడు తగిన బోధకులను విస్తారంగా శిక్షణయిచ్చి తయారుచేసి మీరు వొక్కొక్కరు వొక్కొక్క చదువురాని వ్యక్తికి చదువు నేర్పుతూ, వారుకూడా అదేరీతిని పనిచేయునట్లు ప్రోత్సాహ పరచండని నియమించడం వుత్తమ విధానం.

సమిష్టివర్గాలతో యేర్పడే తరగతులలో చదువులు నేర్పేటప్పుడైనా యీ వ్యక్తిగతమైన శ్రద్ధ అవసరమనేది మరువకూడదు. ఆ తరగతిలోని అనేకులను సమానార్హతలు గల గుంపులుగా విభజించుకోవడము వొక్కొక్కప్పుడు అవసరమౌతుంది. ప్రార్థన, పాటలు, గీతములు, విచిత్ర విశేషముల విమర్శ, యిత్యాది సందర్భములలో అందరిని ఒకటిగా

కలిపి కాలక్షేపం చేసినా పాఠం చెప్పే సమయానికి సమానా ర్హతకల వర్గాలను వేరు చేసి చెప్పడం తప్పదు. వుదాహార ణార్థం చర్మకారుని, వడ్రంగిని వొకటేవర్గంక్రింద ఆలో చించి చదువునేర్పను వుపక్రమిస్తే ఆ చదువు యిరువురికీ అంటక పోవచ్చును. అంతేకాదు; ఒక్కొక్కప్పుడు చదువు కుంటామని మన దగ్గరకు చేరేవారిలో యెన్నడో ఒ, న, మలు, దిద్దపెట్టుకొని ఆమాటే మరచిపోయినవారు కొందరు వస్తారు. తడిపొడిగా జ్ఞాపకమున్న వారు కొందరు వస్తారు. అక్షరపువాసనే యెరుగనివారు యితరులు వస్తారు. ఈ కడ పటి వర్గంవారికి మన యిష్టం వచ్చిన విధానాన్ని అనుసరించి చదువు చెప్పితే సాగిపోతుంది. కాని మొదటి రెండువర్గాల వారికీ మనసులో ప్రాతవాసనలు అంటుకొని వుండడం చేత అదివరలోని ధోరణిలోనే వారికి చదువులు నేర్పిస్తేనే కాని వారు నేర్చుకోలేని పరిస్థితులు వుంటాయి. వారిని క్రొత్త మూసలోవేసి రూపం తీర్చడానికి ప్రయత్నించడం కంటె వారికి అనుభవమై యెక్కడో మెదడులో కనిపించకుండా వుండిపోయిన మార్గాన్నే వారిని తయారుచేయడం వివేకపు దారి. ఈ వివిధావసరాలను గుర్తించి వొక్కొక్కప్పుడు మనము వొకే తరగతి అనుకున్నదానిని రెండుమూడు తర గతులుగా నడపడం, వొక వుపాధ్యాయునితోనే పూర్తి చేస్తామనుకున్నచోట యెక్కువమంది వుపాధ్యాయులను వినియోగించడం అవసరమౌతున్నది.

# ౪. చదువు, వ్రాత

అక్షరాస్యత అంటే చదువను, వ్రాయను శక్తి సంపాదించడమని నిర్వచించినాము. కాబట్టి యీ చదవడము, వ్రాయడము అనే యీ రెండు క్రియలు యెట్లేర్పడునో తెలుసుకోవడం కర్తవ్యము. ఈ రెండు క్రియలకు సంబంధించినది శబ్దములను సంకేతించే అక్షరాలే. మానవక్రియలు అన్నిటికి సంబంధించినట్లే యీ రెంటికి కూడా మెదడు సంబంధించే వున్నది.

ఈమాత్రము సామ్యము వున్నప్పటికీ చదువు, వ్రాత యీ రెండూ ప్రత్యేక క్రియలు.

చదవడంలో మెదడుతో కూడా పనిచేసే అవయవము కన్నొక్కటే. అక్షరములు, పదములు, వాక్యములు అనే శబ్దాలగుర్తులను కన్ను పోల్చుకునే క్రియకు చదవడమనే పేరు.

ఒక నిర్ణీతమైన శబ్దానికి నిర్ణీతమైన గుర్తు అక్షరము. ఉదా : అ.

ఒక నిర్ణీతమైన అర్థముతో కూడిన శబ్దమే పదము. ఉదా : నీరు, గాలి, వగైరా.

అర్థము పరిపూర్తి అయేటట్లుగా యేర్పడిన యేక పదమో, పదముల కూడికో వాక్యము. ఉ: రాముడు రాడు.

ఒకే అక్షరముతో కూడిన పదములు, వాక్యములు కూడా మనభాషలో కలవు. ఉదా : రా! పో!

చదవడము అనుక్రియలో మనముచేసే పనియేమి? ఈ అన్ని శబ్దాలగుర్తులను కంటితో చూచి పోలుస్తున్నాము. చదవడము శబ్దము బయటికి వచ్చేటట్లుగా బిగ్గరగాను, శబ్దము చేయకుండా మన మనస్సుకు మాత్రము గోచరించే టట్లుగాను జరపవచ్చును. శబ్దము లేకుండా మనస్సుకు మాత్రం గోచరింప చేసినప్పుడు అట్టిక్రియను మౌనవాచకమని వ్యవహరిస్తున్నాము.

## శ్రవణేంద్రియమునకు మొదట ప్రాముఖ్యము

మనము నేర్పించడం, యింకొకరు నేర్చుకోవడం అనే రెండు కార్యాలు జరుగవలసియున్నప్పుడు మౌనవాచకమునకు అవకాశమేలేదు. చదువను నేర్చుకోడానికి నేర్పించడానికి అనే మాటయేల? సాంఘిక కార్యానికి దేనికైనా యిరువురో అంతకంటె యెక్కువ వ్యక్తులో సమావేశమైనప్పుడు కంఠము కదల్చకుండా పనిచేసుకోలేరు కదా! అంటే సంగతి వినిపించే వాని విషయంలో శబ్దమునకు సంబంధించిన అవయవములు, వినేవాని విషయంలో చెవి పనిచేస్తున్నవన్న మాట. మన చరిత్రలో వొకప్పుడు విషయజ్ఞాన గ్రహణకు వివరణచేసే వాని కంఠానికి, వినేవాని చెవికీ ప్రాధాన్యమిచ్చే వారు. ఉపదేశము, శ్రవణము అనేపదాలు విరివిగా వాడే వారు. మనన, ధ్యాన, ధారణ వగైరాలు తరువాత నమోదు చేసేవారు. పఠనమనేమాట యీ సందర్భంలో మన ప్రాచీన

గ్రంథాలలో కనిపించదు. యీశ్రవణేంద్రియపు ప్రాముఖ్యం చాలా యెక్కువగా యేర్పడడం చేత వ్రాయడం ఆరంభ మయిన తరవాతకూడా శ్రవణేంద్రియ ప్రాముఖ్యంపోలేదు. అక్షరాలేర్పరుచ్చకొన్నప్పుడు మన పెద్దలు ప్రాతధోరణిలోనే పని చేసిరి. అక్షరాలు శబ్దాలకు గుర్తులని యిదివరలోనే చెప్పితిమిగదా ! యీ శబ్దాలు పుట్టేస్థలాలు గొంతు, దవడలు, పండ్లు, నాలుక, వీటి పరస్పరపు జోడింపులు. కాబట్టి ఆపుట్టుక స్థానాల చుట్టరికాన్ని గమనించి అక్షరాలు 'క' వర్గు 'చ'వర్గు 'ట' వర్గు 'త' వర్గు 'ప' వర్గు మొదలగు వర్గాలుగా విభజించిరి. చదవటానికి కంటికనుకూలంగా వుండేటట్లు అక్షరముల వర్గీకరణం సాధించవలయుననే ధోరణి వారికి కలుగలేదు. శబ్దశాస్త్రానుసారంగా యేర్పరచిన యీ వర్గీకరణానికి కూడా అవాంతరాలేర్పడి వొక్కొక్కప్పుడు యిది మార్పు చెందినది. మతవిశ్వాసాలనుబట్టి వర్ణమాల నేర్పించడం 'ఓం నమశ్శివాయ సిద్ధం నమః' అనే ప్రార్థనతో ఆరంభంచేయడం సంభవించినది. దేశభాషలలో తమ మత వ్యాప్తికోసము అతి విస్తారంగా వాడిన శైవులు, జయినులు యీ ఆచారాన్ని తెచ్చిపెట్టి వుంటారు. కొంతకాలము యీ ఆచారము సాగిన మీదట యీ ప్రార్థన అక్షరమాలలో చేరిపోయినది. చదువులు నేర్పేటప్పుడు ఓ, న, మః, శి, వా, యః, సి, ధం, న, మః, అని దారీ తెన్నూలేని అక్షరాలు వర్ణమాలకు మొదట చేరిపోయినవి.

## అచ్చు యంత్రముల వలన మార్పు

అచ్చు యంత్రిముల వ్యాప్తి పెరిగి వ్రాసిన విషయానికి వేనకువేలు ప్రతులు యేర్పడడంచేతను, కంటితోచూచి అక్షరములను పోల్చుకోవడం సాధారణం కావడంచేతను, చదువుకు సంబంధించిన విషయంలో మన అభిప్రాయములు కూడ మారవలసి వచ్చినది. ఇదివరలో యేర్పడిన అక్షర మాలను వున్నది వున్నట్టుగా అ, ఆ, ఇ, ఈ ల వరుసను వుచ్చారణ క్రమాన నేర్పడానికి ప్రయత్నించేవారు యిప్పటికి కొందరు వున్నా, సాధారణంగా ఆ మార్గం అనుసరించే పరిపాటి తప్పిపోయింది. అక్షరాలనేవి చదవడంలో కన్ను గుర్తించవలసిన సంకేతములు అనడం అంగీకృతమైనది. కంటికి సులభతమంగా గ్రాహ్యమై, మనస్సుకు శబ్దముయొక్క ఉత్తమమైన మార్గమేది ? అనే విచారాన్ని మనము యెక్కువగా చేస్తున్నాము.

కన్ను మాత్రంతో చదువు పూర్తియైపోదని మనకు తెలియును. కన్ను చూచిన దానిని మెదడు రికార్డుచేసి కంటిద్వారా వచ్చిన అనుభవాలను వొకటిగాచేసి తాను పరిశ్రమచేస్తేకాని మెదడు కంటిని వినియోగించుకోవడానికి అవకాశంలేదు. కంటికి మెదడుయొక్క సహాయము లేక పోతే కంటిచూపు యేవిషయము నందైనను నిష్ఫలము. మెదడు-అందులో ముఖ్యముగా వయోజనుని మెదడు దానికి ప్రత్యేకంగా గల శ్రద్ధనుబట్టి పరిశ్రమ చేస్తుందనడం స్పష్టం కాబట్టి అర్థములేని వట్టి శబ్దోచ్చారణములైన వేరువేరు అక్ష

రాలనే గుర్తులయెడల యే వయోజనునికిగాని బిడ్డకుగాని యెక్కువ శ్రద్ధపుట్టడం అసంభవం. అట్లా వట్టి అక్షరాలమీద దృష్టి నిలుపవలసివస్తే అది బరువైన అనుభవం అయిపోతుంది. వొకప్పుడు యీ బరువు కార్యక్రమం అమలులో వుండడం జరిగిందని, పిల్లలు అక్షరాలు నేర్చుకోవడం అంటే వొక పెద్దప్రయత్నంగా వుండిపోయి యిందుకుగానే వారి వయస్సులో రెండుసంవత్సరములు పట్టిపోతూవచ్చేదని మన మెరుగుదుము. మన అదృష్టవశమున ఆదినములు యిప్పుడు గడచిపోయినవి. చదువరి మనస్సును ఆకర్షించి నిలిపే విధానాలను ఆలోచిస్తున్నాం. అమలులో పెడ్తున్నాం.

అక్షరాలు యెట్లు పుట్టినవని చారిత్రకంగా పరిశోధిస్తే ఆదిని ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క వస్తువు బొమ్మగా వుండి మనుష్యుని మెదడును ఆకర్షించేదని తెలుస్తుంది. ఈ దినముకూడా చీనావారి అక్షరమాలలో అన్నీ బొమ్మలే. ప్రపంచములోని అన్నిభాషల అక్షరాలు అనేక విధాలైన మార్పుచెంది నూర్లు, వేలసంవత్సరాలలో నేటి స్వరూపాన్ని పొందడం సంభవించినది. క్రమక్రమంగా వాటికి వుండిన బొమ్మల ఆకారము మారిపోయి నేడు కనుపించే గుర్తుల మాత్రంగా యివి యేర్పడినవి. వ్రాత ఆరంభమై మునసబ్దీల చేతిత్రిప్పుడులకు అక్షరాలు పాత్రలు కావడంతోను అనేక రకాల వ్రాత పరికరాలు వేరువేరు దేశాలలో వుపయోగంలోనికి రావడంతోను భిన్నభిన్నస్వరూపాలు అక్షరమాలకు యేర్పడిపోయినవి. వేరువేరుభాషల అక్షరమాలలను

పరిశీలిస్తే ఆయాజాతులవారు వ్రాయడానికి వుపయోగించిన గంటములు, కలాలు, భూర్జపత్రములు, తాటియాకులు, ముతకకాగితములు, తళుకుకాగితములు వగైరా అన్నిటివల్లా అక్షరము తీర్చడములో కలిగిన విచిత్రమైన మార్పులు మనం నిర్ణయింప కలుగుతున్నాం. ఈకథలిట్లున్నా నేటిదినము చదునరికి ఆకర్షణీయమైన పరిస్థితులు కల్పించి అతడు త్వరగాను, సులభముగాను చదువు నేర్చుకొనే మార్గాలే అమలులో పెడ్తున్నాం.

## వ్రాత

అక్షరమాలను చదువనూ, వ్రాయనూ నేర్పే విధానాలు ఆలోచించడానికి ముందు కొద్దిగా వ్రాత అనే ప్రక్రియ స్వరూపాన్ని కూడా తెలుసుకోవడం అవసరం.

కన్ను, మెదడు రెండు అవయవాల కార్యాచరణ మాత్రం వ్రాతకు చాలదు. అందులో మన వేళ్ళుకూడా పనిచేయవలసి యుండును. చదవడము అభ్యాసమై కన్ను అక్షరములను సులభంగా గుర్తించే అలవాటుపడి వుండక పోతే, ఆ గుర్తించే శ్రమ మొదటచేసి వేళ్ళతో అక్షర స్వరూపాన్ని తీర్చవలసివుంటుంది. ఇందులో మెదడు యీ రెండు కార్యాలపైన దృష్టి వుంచి పనిచేయవలసి రావడంతో, సాదాచదువు కార్యము నడపుటకంటె యిది యెక్కువ భారముతో తీర్చవలసి వుంటుంది. కాబట్టి చదవడం ధారాళంగా అలవాటయి పోయినతర్వాత వ్రాత అనే

క్రియ ఆరంభించేస్తే సులభతరంగా సాగుతుంది. అందువలన వయోజనులకు నేర్పేటప్పుడు వయోజనులకే అని యేల? పిల్లలకు నేర్పేటప్పుడు కూడ చదవడం, వ్రాయడం కలిపి నేర్పడం అంత అనుకూలంకాదు. మొదటనుంచీ వ్రాతదిద్ది పెట్టడం అంతకంటే కఠినతరకార్యం. వ్రాత చదువుకు తర్వాతనే అభ్యసింప తగినది. ఇట్లనడంచేత యెవరైనా ఒక వయోజనుడు చదువుతూ వుండగానే తాను వ్రాయగలననే వుత్సాహాన్ని కనుపరిస్తే అతనిని నిరుత్సాహపరచ కూడదు. తమ అనుభవాల వలన యెవరో కొందరు వయోజనులు త్వరగా వ్రాయడానికి కూడా ధోరణికలవారు కావచ్చు. ఉదాహరణ ఆలోచిద్దాం. వడ్రంగి రూపాలను కర్రమీద గీచిగాని చెక్కడం పనిచేయడు. ఆచిత్రలేఖన శక్తిచేత అతడు అక్షరాలను తీర్చడంకూడా సులువుగా నేర్చగలడు. మానవుడు తన పనికి తాను మురిసేవాడు. తనపేరు తాను వ్రాసుకొని సంతోషించడం అతనికిసహజం. కాబట్టి వయోజనుడు విద్య నేర్చేటప్పుడు చాలాకొద్దిగా నేర్పినపిదపే తనపేరు తాను వ్రాసుకొనేటట్టుగా అతనిని ప్రోద్బల పరచడం అంత కష్టమైన పనికాదు.

వ్రాత అనే క్రియకు, చదువుఅనే క్రియకు వుండే తారతమ్యాలను బట్టి వయోజనుడు చదవడం కొంత నేర్చిన తరువాత వ్రాతనేర్పించడం మేలని నిర్ణయించ వలసినదిగా వున్నది.

# ౫. బోధన పద్ధతులు

వయోజనులకు చదువనూ, వ్రాయనూ నేర్పించడములో విషయజ్ఞులు అనేక విధానాలాలోచించారు. చదువరిని ఆకర్షించి అతనికి శ్రద్ధకలిగించి చదువనూ, వ్రాయనూ నేర్పించవలయుననే కుతూహలమే యీ విధానాలను కను గొనుటకు దోహదమైనది.

## ప్రత్యేకాక్షర విధానము

ఒకప్పుడు చదువులు చెప్పడంలో ఓనమాలు అ ఆ ఇఈలు, కఖగఘలు, గుణింతాలు వరుసగా అక్షరం అక్ష రంగా నేర్పించేవారు. కాకూ కావత్తిస్తే 'క్క' కాకూ ఖా వత్తిస్తే 'కఖా' కాకు గావత్తిస్తే 'కగా' అని చిత్రవిచిత్రంగా వల్లింపచేసేవారు. ఇందులో విశేషభాగం భాషలోకన్పించేవే కావు. పదములు కూర్చడానికి మాసాలూ యేండ్లూ పట్టేది. ఇదంతా వ్యర్థమయిన ప్రయత్నం అని బాగా గుర్తించిన తరువాత యీ విధానం వుపయోగంలో లేకుండా పోయింది.

## కథా విధానము

విషయ గ్రహణకు యెంత అవకాశమిస్తే అంత ఆకర్షణ, అంత శ్రద్ధ వయోజనునికి కలుగుతుందనే విశ్వాసం చేత కథావిధానం యేర్పడింది. ఉదాహరణ ఆలోచిద్దాం.

బొంబాయిలో మరాఠీ నేర్పడానికి వుపయోగించే ప్రథమ బోధినిలో గజేంద్రమోక్షము కథతో గ్రంథము ఆరంభమౌ తుంది. కమల అనేపదమును, మగర అనే పదమును, భజన అనే పదమును ప్రాతిపదికగా తీసికొని గజేంద్రమోక్షము కథ అల్లుతారు. అందులో యీ పదములు మాటిమాటికి వచ్చే రీతిగా రచన మారుస్తారు. వీటికి సంబంధించి పరిస్ఫుటంగా విషయము కనుపించేటట్లు గజేంద్రమోక్షపటము తయారు చేసి ప్రక్కన కనబరుస్తారు. ఇదేవిధంగా సావిత్రికథ, శివాజీకి అతని తల్లి కత్తి చేతికిచ్చే కథ, అక్బరు వీరబలుల కథావగైరాలు చేర్చినారు. ఈ అన్నిటిలోను హల్లుల అకార హ్రస్వము, అకార దీర్ఘములు నేర్పుతారు. తర్వాత ఈహల్లులతో ఇకార హ్రస్వము, ఇకార దీర్ఘములు చేర్చి పైరీతి పాఠాలే వాటికీ తయారు చేస్తారు. ఇది కథావిధానము లోని పాఠ్యక్రమము. ఇందులో ప్రయోజనాలు లేవనడానికి వీలులేదు. కాని అనావశ్యకమైన కాలహరణం యేర్పడుతుంది అనడం ఒకే ఆరోపణ. ముఖ్యంగా అరవంలోవలె అక్షరాలు కొద్దిగానేవుండి అచ్చుగుణింతము సర్వత్రా సమంగానేవుంటే యీ పద్ధతిని అవలంబించడం వృథాపరిశ్రమ అవుతుంది. నిజ మునకు లాబక్ అనే గ్రంథకారుడు తాను ఒక్కదినములోనే అరవంలోని అన్నిహల్లులతో అన్ని అచ్చుల కూడికలను నేర్పగలనని పటము తయారుచేసినాడు. అంతత్వరగా కాక పోయినా బహు కొద్దికాలములోనే అరవ అక్షరమాల గుణింతములతో కూడా ఆయన విధానాన్ని కొంత సంస్క-

రించి నేర్పగలుగుతున్నాము. ఈ కథావిధానానికి యింకొక ఆక్షేపణకూడా కలదు. చదువను నేర్చుకొనేవానికి మనము నేర్పదలచుకొన్నది యే ఆరో, యెనిమిదో అక్షరాలే అయినా కథలో భాషలోని అన్నిశబ్దాలు చేరిరావడం చేత అయోమయత్వం కూడా కలుగవచ్చును. కొద్దిమాటల కొరకు ఇంత ద్రావిడ ప్రాణాయామంగా పాఠాలు నేర్చుకో వలయునంటే నేర్చేవాడికి అసంతృప్తి కలుగవచ్చును. అదీ గాక అనేక పర్యాయాలు ఒకే పదము రావలయుననే దీక్షతో రచన చేయడంతో అది కృత్రిమరూపం తాల్చడం కూడా సంభవిస్తుంది. ఈ విధమైన కథావిధానము మరా ఠీలో కొంత విజయవంతంగా పనిచేసిందని తెలుస్తుంది. కాని యిదే విధానము హిందీలోను, మరి యితర భాషలలోను ప్రయత్నించడం సులభసాధ్యం కాలేదని విజ్ఞులు నిర్ణయాలకు వచ్చారు. కథావిధానములో నైనా మాటల మీద దృష్టి కేంద్రీకరించి ఆరంభించకుండా తప్పదు.

## పద విధానము

ప్రత్యేకము, కథ అల్లుట కంటే చదువుకొనే వయో జనునికి ఆకర్షణగా వుండే పదాలను యేర్చి కూర్చి వుపయో గించుకోవడం మంచి విధానంగా కనిపిస్తుంది. మన స్త త్వాన్ని గురించి వ్రాసేటప్పుడు వొక వుదాహరణ యిచ్చి తిమి. టేకు అనే మాటను వుదహరిస్తే వడ్రంగికి యెన్ని

రకాల భావాలు పుట్టిపెరిగి విజృంభించునో వివరించితిమి. అట్లే మరియొక పదమును మరియొక రకపు మానవునికి ఆకర్షక మౌతుంది. కాని పదముకూడా పూర్ణార్థము కలది గాదు. వాక్యరూపము యేర్పడినపుడే పదానికిగాని, పదాలకుగాని పూర్ణార్థము కలిగి ఆకర్షణీయ మగునని కొందరి యభిప్రాయము. ఇదికొంత నిజమేగాని వ్యాకరణంలో కర్త, కర్మ, క్రియాత్మకంగా నిర్వహించే వాక్యము యథాతథంగా వుండనక్కర లేదు. సామాన్య మానవుని సంభాషణలో చాలమట్టుకు యేకపదాలు, అస్పష్టవాక్యాలే అర్థద్యోతకంగా వుంటున్నవి. "ఊ" అంటే యెంతో అర్థము యిమడటము కనిపిస్తుంది. "ఓహో" 'అట్లనా' అనేటప్పటికి ఒక ప్రపంచమే వినువానిమనస్సుకు తట్టడానికి అవకాశమున్నది. అసలు మన తెలుగు భాషలో కర్తతో అవసరం లేకుండా క్రియామాత్రంతో వాక్యాలేర్పడతాయి. యెవరినో గురించి మాట్లాడుతూ "రాడు" అని ప్రయోగిస్తే పేరు చెప్పడం గాని వాడు అని ప్రయోగించడంగాని అనావశ్యకమవుతాయి. ఇంతేకాదు, యేకాక్షర వాక్యాలును లేకపోలేదు, "పో" "రా" ఇత్యాదులు వుదాహరణలు. ఈ కారణం చేత పదవిధానము, వాక్యవిధానానికంటె యెంతో విభిన్నమైనది కాదనడం స్పష్టంగా తేలుతుంది. అయితే సాధ్యమైనంతత్వరలో అసంపూర్ణార్థముగల పదమును వూతగా గొని పూర్ణార్థముగల వాక్యంలోకి వచనంలోకి మార్గం తీయడం అవసరము. నేను వయోజనవిద్య – మొదటిపుస్తకం

వ్రాయ తలపెట్టినప్పుడు నాకును వొకసందేహము కలిగినది. పదవిధానమును అనుసరించి వ్రాయుటలో అన్ని కులాల వారికి, అన్ని అంతస్థులవారికి, అన్ని వృత్తులవారికి స్త్రీలకు, పురుషులకు అందులో వొక్కొక్కరికి ఆకర్షకమయ్యే పద విన్యాసము ఒక్క పుస్తకములో చేసి చూపడం సాధ్యము కాదనిపించింది. ఆలోచన చేయగా చేయగా సర్వజనులూ వాడుకొనే లోకోక్తులు, అందరికీ చెవినిబడే పాటో పద్యమో ప్రాతిపదికగాగొని అందుకనువైన పదసామగ్రితో ఆరంభించ డము అనువుగాతోచినది. భాగవతములోని దశమస్కంధము నందలి "కలడందురు దీనులయెడ కలడందురు పరమయోగి గణములపాలన్" అనే పద్యము నా స్మృతిపథాన ఆక్రమించినది. అందులో పదమూడు అక్షరాలు, తేలికయైన గుణింతము వుండడంచేత పదమూడు పాఠాలలో యిదినేర్ప డానికి వీలు అవుతుందని తోచి వ్రాయడ మారంభించి నాను. "వానరాక వరదరాదు" మొదలైన లోకోక్తులు జ్ఞాపకమునకు వచ్చినవి. అంతటితో రెండుపాఠాలలోపదాలు మాత్రం చెప్పి శివ పాఠంలో "రారా, రామా, పాపా, రారా, రావాపాపా, అంటారంటా, కంటారంటా, వాలం వంకర, ఆట ఆడుదాము, పాట పాడుదాము, రారారామా రవికులసోమా, వీణాగానము వినుము, పిలువని పేరంటము నకు పోరాదు, కలిమిలేములు కావడికుండలు, దూరపు కొండలు నునుపు" వగైరా వాక్యాలు యీ పాఠములలో కూర్చితిని. కాని వొకప్పుడు శృంగారపురములో రాత్రిపాఠ

శాల ఆరంభిస్తూ పెద్దలకు చదువు నేర్పించడములో అక్కడ అప్పుడు రామాలయమువద్ద జరుగుతూవుండిన భజన రాముల దేవాలయంమీద వ్రాసిపెట్టిన శ్రీరామ శ్రీకృష్ణ నామ స్మరణలు గమనించి సమయస్ఫూర్తిగా రామశబ్దముతో పాఠము ఆరంభించి 'పతితపావన రామ' అనే చరణం 3 పాఠాలలో పూర్తిచేసి ముందుకు రథము సాగించితిని. అంటే వయోజనులకు విద్య నేర్పునపుడు పదవిధానము అనుసరించినా, మరి యేవిధానము అనుసరించినా చదువుకు నే వారి జీవితానికి అతి సన్నిహితమైన ఘట్టములను పాఠముల లోనికి యిమిడ్చే ప్రయత్నము చేయవలసినది కర్తవ్యము. ఈ మూల సూత్రానికి లోబడి పదవిధానంలో బోధచేసే పద్ధతిని యింకా కొంత వివరంగా ఆలోచన చేదాము.

వయోజనులకు కానిండు. పిల్లలకు కానిండు. ఒక శబ్దానికి గురిఅయిన గీతలలో చేరిన అక్షరాన్ని నేర్పవలయు నంటే ఆ గుర్తును నల్లబల్లమీదనో, పలకమీదనో, కాగితంమీదనో వ్రాసిచూపించి నేర్పడానికివీలుంది. అందుచేత యే పదంలోని అక్షరాల గుర్తులనైనా వేరువేరుగా యీ రీతిగ వ్రాసి నేర్పవచ్చును. కాని యీ ప్రయత్నముచేస్తే యిది ఆకర్షణీయపద్ధతి కాకపోవచ్చును. కృత్రిమవిధానంగా పరిణమించి రెండుమూడు గుర్తులమీద వొకేసారి మనస్సు నిలపడం సాధ్యంకాక చదువరికి వేసట కలుగజేయవచ్చును. కాబట్టి పదవిధానము అనుసరించేటప్పుడు ఆ పదంలోని

మొదటి అక్షరంమీదే గురినిలిపి ఒక అక్షరం ఒక పర్యాయం నేర్పేప్రయత్నం చేయవలసి యుండును. ఇది సాధించడానికి ఆ అక్షరాన్ని ప్రత్యేకంగా రంగుసిరాతో అచ్చువేసి పటము తయారు చేసుకొనవచ్చును. ఇక దానివుచ్చారణకు. పదమును ఉచ్చరించేటప్పుడే బోధకుడు ప్రత్యేకంగా వినిపించేటట్లు వుచ్చరించి వేరు చేయవచ్చును. ఈ మాత్రము వుపాయం చాలునా ? ఇంకా యెక్కువ వుపాయాలలో సౌలభ్యం సమకూర్చ వచ్చునా? అనేది ప్రశ్న. సాధారణముగా నేటిదినము యే అక్షరవుగుర్తు నేర్పదలచుకున్నామో ఆ అక్షరముతో ఆరంభమయ్యే పదాన్ని బొమ్మవెయ్యడానికి వీలైనదిగా చూచుకొని ఆ బొమ్మవేసి దానిప్రక్కన పదమును జోడించి అక్షరమును ప్రత్యేకరంగులో తీర్చి తయారు చేయడం జరుగుతున్నది. ఇక్కడకూడా వొక్కొక్కప్పుడు చిన్ని కష్టాలు యెదురౌతుంటాయి. కొన్ని భాషలలో ఒకే బొమ్మ వేస్తే దానిని వర్ణించడములో సమానార్థముగల పదాలు రెండు మూడు వుండడం సంభవిస్తున్నది. మనము తలపెట్టిన పదముగాక చదువరి యింకొక పదాన్ని వాడితే మన కార్యం అంతా చెడుతుంది. ఈ స్థితినుండి తప్పుకోడానికి ఒకటే మార్గమున్నది. బోధకుడు బొమ్మను చూపించి మొదట తానే పదాన్ని వుచ్చరించి చెప్పవలయును. మరి రెండవ కష్టము యేమంటే చాల తక్కువ అక్షరాలు యేర్పరచుకొన్న అరవమువంటి భాషలోకూడా అచ్చులు, హల్లులు, అచ్చుల హల్లుల గుణింతము, హల్లుల హల్లుల గుణింతము అన్నీ కలసి వుచ్చారణకు బాహుళ్యమేర్పడును. ప్రతి అక్షర

వుచ్చారణకు బొమ్మ తయారుచేసి పటాలువేసి పుస్తకాలు తయారు చేయవలయునంటే సాధ్యపడదు. కాబట్టి కొంత దూరము యీ బొమ్మలవిధానం అనుసరించిన తర్వాత కార్య క్రమం సాదాగా నడపడం ఆచారంగా జరుగుతూవుంది. ఇప్పుడు వయోజనుల విద్యకై వుపయోగంలోవుండే పదవిధా నములోని పటాలలో లాబక్ పటాలనేవి మొదట ప్రచారము లోనికి వచ్చినవి.

లాబక్ అక్షరాభ్యాస పటము

ఫిలిప్పైను దీవులలోను ఇతర ప్రాంతములలోను ప్రజ లను నూటికి నూర్గురను అక్షరాస్యులను చేయవలయు నను వుద్దేశముతో గొప్పకృషిచేసి తన్మూలముగా ప్రపంచమంత టను ప్రఖ్యాతిపొందిన డాక్టరు లాబక్ అనునతడు తన విధా నము భారతభూమికిగూడ పనికి రాగలదని తలంచి యిచటికి వచ్చి కొన్ని భాషలలో వొక అక్షరాభ్యాస పటమును, దాని వివరణముగా చిన్న పొత్తమును సిద్ధముచేయించి ప్రకటించి నాడు. అట్టి భాషలలో తెలుగుకూడ వొకటి. మన దేశము నందు తెలుగులోనేగాక అరవము మున్నగాగల యితర భాషలలోను పాదిరీలు–వారినే మిషనరీ లందుము–తమ మత ములో చేరు బీదసాదలకు అధమము బైబిలు చదువునైనను అభ్యాసము చేయించ వలెనని చాల కాలముగా శ్రమపడుచు వచ్చినారు. లాబక్‌కు చాల ముందునుండియే బడిపిల్లలకు పుస్తకాలు తయారుచేసినట్లే పెద్దల అక్షరాభ్యాస పుస్తకాలు మిషనరీల పరంగా తయారయినవి కలవు. సుందరంగారి పుస్త

కాలు‡, దేవరాజ్ గారివి*, హైద్రాబాదువి§ యీ గణానికి చెందినవి. ఈయన్నిటికిని అధిష్ఠానపోషకులు సి. యల్. యస్. సంఘమువారు. లాబక్ యిక్కడికి వచ్చినపుడు వారికిస్నేహము కుదిరినదికూడ సి. యల్. యస్. వారితోనే. వారే లాబక్ అక్షరాభ్యాస పటమును ప్రకటించినారు. కాబట్టి మిషనరీ ప్రచారకులు, ప్రభుత్వ ప్రచారకులు, బొమ్మలు సంగీతముల సహాయ సంపత్తి కారణంగా యితరులుకూడ, విరివిగా వుపయోగించే పటము లాబక్ పటమయినది. మదరాసు కార్పొరేషనులో వయోజన విద్యాకేంద్రములేర్పరచి అచ్చట బోధనకు కుదిరిన పంతుళ్ళకు శిక్షణ యిచ్చునప్పుడు నేనీ లాబక్ పటమును వినియోగించి చదువు చెప్పుట సంభవించినది. అందుచేత యిందులోగల గుణములు లోపములు పరిశీలించి యితర ప్రయత్నములతో, ముఖ్యముగా యిటీవలనే నే చేసిన ప్రయత్నములతో, తారతమ్యము లెంచుకొనుట సాధ్యమయినది. లాబక్ విధానమునందు (1) బొమ్మ (2) అక్షరము (3) పదము (4) పాట యివి ఆధారములు. మొదట 'ప' నేర్ప దలచినాడు. దానికి పందియను బొమ్మనుచూపి పల్కించును. ఆ పదములో మొదటి యక్షరమేమి యని యడుగును. 'ప' అను జవాబుతీసుకొని 'పంది' లో 'ప' ను చూపును. 'ప'

‡ కె. జె. జి. సుందరం – పెద్దల వాచకము. మొదటిదశ
డిటో రెండవదశ

* బి. ఇ. దేవరాజు, ఎం. ఏ., ఎల్. టి. – నంద్యాల మొదటివాచకము
నంద్యాల రెండవవాచకము

§ హైదరాబాదు పెద్దల వాచకపుస్తకము 1, 2, 3 భాగములు

మాత్రము నల్లసిరాలో అచ్చయి యుండును. తక్కంగలది యెర్రసిరా. పిదప బొమ్మ పాము వుండును. దానిని పల్కించి 'పా' స్వరూపమును చూపును. ఆకార సూచకమగు 'ా' ను యిందు ఆకుపచ్చరంగులో అచ్చువేసి యుండును. యీ విధముగా పి, పీ, పు, పూ, పె, పే, పై, పొ, పో, పౌలు మొదటి వరుసనే నేర్పవలె ననుట వుద్దేశము. కాని లాబక్ పటములో హ్రస్వ దీర్ఘము లన్నిటినీ పల్కించుటకు తగిన రంగు బొమ్మ లీయలేదు. పిల్లి, పూవు, పెట్ట, పౌలములను మాత్రమిచ్చినారు. నేర్పునప్పుడు లోటుపడిన అక్షరాలకు బొమ్మలు సిద్ధము చేసుకొని చూపుడని మేము బోధించితిమి. లాబక్ పటములో నేర్పనెంచిన రెండవ యక్షరము 'క'. దీనికి 'కప్ప' బొమ్మమాత్రము వేసినారు. 'కా' మొదలు 'కౌ' వరకు గల గుణింతములకు బొమ్మలు లేవు అట్లే వారిచ్చిన యక్షరము లన్నింటికిని సంభవించినది. దీనికి కారణమున్నది. 'ప' కు గుణింతములు నేర్పునప్పుడు బొమ్మలతో గుణింతాల స్వరూపాలు చూపించితిమి. కాబట్టి మొదటిఅత్వ మాత్రానికి బొమ్మతో ఆరంభించి శ్రద్ధకుదిరితే తరువాతివి పైవరుసలో వలెనే యని చూపించవచ్చును. అంతేకాదు. మొదటి యక్షరము "ప" ను నేర్పునప్పుడే దీర్ఘాలన్నిటిని 'పా, పీ, పూ, పే, పో, యని అందరు పాడండీ, అని పూర్ణ కంఠమున పాడింతురు. అదేవిధముగ ప్రత్యక్షర అభ్యాసమప్పుడును పాడింతురు. పలుమారీ పాటరావడముచేత సామ్యము స్ఫురించుచునే యుండును గావున బొమ్మల సాయము అప్రాధాన్య మనినను అనవచ్చును. మరి పాట కోడ్పాటు

హ్రస్వపు గుణింతాలకు కుదురుటలేదు. 'ఉ' త్వము 'ప' కిచ్చినపుడు యితర వర్ణముల కిచ్చినప్పుడు భేదిల్లును. అదియు వేరుగా చెప్పితీరవలెను. అరవమున అక్షరములు తక్కువ కాబట్టి వారి పటములోనికి అన్ని అక్షరములు అన్ని గుణింతములు యిముడ్చగల్గినారు. ఆభాషలో సంయుక్తాక్షరము లేర్పరచుటకు వారికే సూత్రము. హల్లుకు పైన చుక్కపెట్టి చేరవలసిన ముందు హల్లుతో కూర్చి వరుసను వ్రాయుటదప్ప వేరుపద్ధతి లేదు. తెలుగున యిట్టివిధానము కుదురదు. యీక్రింది వత్తులును

్క, ్గ, ్జ, ్త, ్వ, ్య, ్ష, ర్

ద్రుతము, పూర్ణానుస్వారము మనకు ప్రత్యేకములు. పూర్ణానుస్వారమునకు లాబక్ పటములో తావున్నది. కాని దానిని ప్రత్యేకముగా నేర్పునుద్దేశము తత్కర్తకున్నట్లు కానరాదు. యితరవత్తుల కాస్కారమే లేదు. యితరవత్తులమాట యట్లుండ ణ, హ, శ వర్ణములమాటయే యెత్తుకొనలేదు. మరి వొత్త్యక్షరముల మాటకేపోలేదు. ఇవన్నియు పోగా మొదట వొకయక్షరమే అన్నిఅచ్చుగుణింతాలతో నేర్పిన పిదప ఆ యక్షరము మనసులో నిలచుట కభ్యాసములిచ్చిరా యనిన అదియు కానరాదు. యీ పటముతో చేరి ప్రకటించిన చిన్నపొత్తములో యిదే 'పా' నే నేర్చెదను. ఇదే 'పీ' నే నేర్చెదను అనురీతి పునరుక్తితప్ప అభ్యాసములు లేవు. కారణము విదితము. అధమపక్షము రెండక్షరములు వాటి అకార దీర్ఘరూపము, లేదా పూర్ణానుస్వారమును నేర్పనిది స్వల్ప

ముగా నైనా పదములయభ్యాస మేర్పరచుట సాధ్యముగాదు. మేము బోధించుటయందు రెండక్షరములయినపిదప అభ్యాస పదములు వ్రాయించి నేర్పితిమి.

ఇదిగాక అరవములో సులభంగా పటము కుదిరినది గదా యనుకొని దానిని ముందిడుకొని పూర్తిగ విమర్శించక లాబక్ తెలుగు అక్షరపటము సిద్ధపరచిరని నాకుతోచినది.

లాబక్ పటములోని గుణములు రంగుల పటములు వేయడము, సరళాక్షరములకు ప్రాధాన్య మీయడము, అచ్చు గుణింతాలను ప్రత్యేకించి వేరు రంగులలో నిరూపించడము, దీర్ఘాలను వినియోగించి పాటరూపకంగా చెవిని దూర్చడము అనునవి. వీనిని వినియోగించుకొని యీ పటమును సంస్కరించి పెంచడానికి, అభ్యాసపదాలకు వేరేపుస్తకం సిద్ధపరచ డానికి, వాక పటములోనే మహాప్రాణాక్షరములు, ప్రత్యేక వత్తులు, హాల్ మాత్రమునకుగల సంజ్ఞతోగూడ నేర్పడానికి వీలున్నది. ఇందులోని అక్షరముల వరుసను వ, క, న, ద, డ, బ, త, య, ర, మ, చ, ప, ల, గ, ట, స, జ, అలనుండి వ, ర, మ, వ, ల, ద, న, త, క, డ, చ, ప, య, బ, గ, ట, జ, శ, హ, ణ, ళ, ల క్రింద మార్చితే నా "వయోజన విద్య - మొదటిపుస్తకం" అభ్యాస పుస్తకముగ చక్కగ పనికివచ్చును. అందుచేత నేను నా బుద్ధికి తోచినరీతిని అన్ని సంస్కరణలు చేర్చి నా మొదటి పుస్తకమునకు సరిపోయే పటము ప్రకటించితిని.

వాకే హల్లుకు వరుసగా అన్ని అచ్చుగుణింతాలు వాకే పర్యాయము నేర్పే ప్రయత్నము చేయడము ప్రయో జన కరము కాదు. మారుతూవుండే 12-13 గుర్తులు వొక్క వరుసన జ్ఞాపక ముంచుకొనడము కష్టసాధ్యము. రెండు మూడక్షరాలు నేర్పి వాటికి ఒక్క అచ్చుగుణింతమును అభ్యాసపరిచితే ఆ గుణింతపు గుర్తు సులభముగా మనస్సులో నిలుస్తుంది.

పా

రా

మా

వా

అనే వరుసపైనుంచీ క్రిందికి చదువడముచేత - అందు లోనూ 'ఆ' దీర్ఘగుర్తు వేరే రంగులో వేసివున్నప్పుడు - గుర్తింపు చాల సులభమవుతుంది. ఈ మార్గమునే నేను నా మొదటి పుస్తకములో అనుసరించినాను.

పై వివరణలో చూపించిన లోపములు లాబక్ చేసిన ప్రయత్నాన్ని తప్పు పట్టుటకు చూపినవికావు. బొమ్మల విధానము మొదటినుండి తుదివరకు అవలంబించడానికి వీలుండనీ, ప్రయోజన విద్యాబోధకుడు అనేక పరిమిత పరిస్థితులలో పనిచేయవలసి వుందని చూపించుటకే. లాబక్ పటంలోను, మరికొన్ని యితర పటాలలోను బొమ్మలకు రంగులు కూడా వేయటంకలదు. ఇది ప్రయోజన కరమే.

రంగులు కంటికి యింపుగా తీర్చిస్తే హృదయానికి ఆహ్లాదము కల్గిస్తాయి. సారాంశము యేమిటంటే వయోజనవిద్యాబోధకుడు తన వుత్సాహాన్ని అనుకూలాలనుబట్టి పదములు నేర్పడానికీ, కథలునేర్పడానికీ, సంభవాలు వర్ణించడానికీ, యితర విషయాలను బోధించడానికీ పటాలు, బొమ్మలు, యెంత వరకు సేకరించగలడో అంతవరకూ సేకరించుకొనడం అవసరం. యిదివరలో చెప్పినట్లుగా యే పాఠ్యపుస్తకంమీదో పూర్ణంగా ఆధారపడకుండా, సమయస్ఫూర్తికలిగి తాము నేర్పే పరిస్థితిలో రసవత్తరమైన పదాలమీదే ఆధారపడడం మంచిది. బెస్తవాడి యెదుట ఆవుబొమ్మ, ఆవు అనే పదము పెట్టితే అతనిని ఆకర్షించుటకు రాదు. పడవ, వోడ, గాలము, చేప యివి అతనికి సన్నిహితములు. అట్లే నేతగాని యెదుట సుత్తి, సమ్మెటలుపెట్టి ప్రయోజనము లేదు. కదురు, నూలు, మగ్గము యిట్టివి యెక్కువ ప్రయోజన కరములు. యీ దృష్టితో చూస్తే తెలుగు నేర్చుకోవలసిన కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, నేతకాడు, వ్యవసాయదారుడు, మేదరి, చర్మకారుడు, బెస్త, వుప్పరివగైరా అందరూ నిత్యజీవితంలో వుపయోగించే పదాలతో బోధకుడు పరిచయము కలుగచేసుకొంటే కాని వ్యవహారము బాగా సాగదు. యిప్పుడు ప్రచారములో వుండే

నిఘంటువులలో యీ విధమైన పదజాలముగాని, యీ వృత్తుల వారి జాతీయములుగాని కానరావు.

అక్షరస్వరూపాన్ని మాత్రమే ఆధారముచేసి చదువులు నేర్పేవిధానము అరవములో ప్రయత్నించినారు. కాని అది యిప్పుడు అమలులో లేదు. తెలుగు అక్షరాలు నిండుసున్న, - పెద్దది, చిన్నది-అరసున్నలతో ఏర్పడును. దానిసూచన నా మొదటి పుస్తకము మొదటిపాఠములో చూపడమే కాక వొక్కొక్క అక్షరము నేర్పేటప్పుడు కూడా సూచించినాను. కాని వొకస్వరూప ధోరణిలో నడిచే అక్షరాలు అన్నీగాని కొన్నిగాని మనయిష్టముచొప్పున తీసుకొని చదువు లారంభించడం ప్రయోజన కరంకాదు. తెలుగులో ఎక్కువగా వాడే లలిత పదాలు, సరళంగా కూర్చడానికి వచ్చేవాక్యాలు చదువులకు ఆధారం కావలసియున్నవి. కావున తెలుగు బాసను మాట్లాడే జానపదుల గొంతులో పలికే శబ్దాలనుపరిశోధించి తరుచువచ్చేక్రమ మిదియని నిర్ణయించుకొన్న ప, ర, మ, వ,ల వగైరా వరుసను తప్పించితే మన వుద్దేశానికే భంగం కలుగుతుంది. కాబట్టి చదువునేర్పడం ఆరంభించేటప్పుడు అక్షర స్వరూప సామ్యాన్నే ఆధారం చేయరాదు. చదవడం కొంత సాగి వ్రాతనేర్పేటప్పుడు ఈస్వరూప సామ్యాన్ని పరిచయం చేయడం కొంత సహకారికావచ్చును. స్వరూప సామ్యము తెలిపే పట్టిక యీ ప్రక్కపుటలో యివ్వడ మయినది

○ ం ◡ ∩ ω ω ω ೧ ి S
ఈ ఎ ప అ గ ఉ చ థ ఇ న
ర ఏ ఫ ఆ ఊ ఛ ద ఈ స క
ఠ ఐ మ ల ఒ జ ధ ణ
ఝ ఖ శ ఓ ట బ
య ఘ ష ఔ డ భ
త హ జ ఢ

గుణింతాల గుర్తులు, తెలుగు అంకెలు కూడా సున్న రూపములో సాధించవచ్చును.

బడికిపోయి చదువుకునే పిల్లలకోసరము మనవాళ్ళు తయారుచేసే మొదటి పుస్తకాలు చాలవరకు వాళ్ళు ముందుకు పండితులు కావలెననే చూపుతో వ్రాయడం జరుగుతున్నది. దాని మేలుకీళ్ళు లోపాలోపాలిచ్చట తర్కించడ మక్కరలేదు. బడిలో చదువక, చదివినా చదువబ్బక, వ్రాళ్ళుకూడ చేయడానికి రాక, తమ బందుగులకు జాబైనా వ్రాయలేక, లోకపు సంగతులు చదువుకోటానికి వీలులేక చిక్కులు పడేవారు పెద్దలైనా తెలుగు లిపి నేర్చుకొని లోకములో తలయెత్తుకొని తిరుగునట్లు తయారుచేయడమే వయోజనవిద్య యుద్దేశము. కాలక్రమాన నిది బడిపిల్లలకుకూడా పనికివస్తుందని నాకు నమ్మికే. కాని యిది కాలక్రమాన జరుగ వలసినది కాబట్టి దాని ప్రశంస యెక్కువ పనిలేదు.

బడిపిల్లల కొరకు తయారుచేసిన పుస్తకాలుమాత్రం పెద్దల చదువుకు పనికిరావని హెచ్చరిక చేయడం తప్పదు.

తెలుగు చదువు

తెలుగు వ్రాత చాలా సులువు. నిండుసున్నతోను, దానిని తెగగొట్టి యరసున్న చేయడముతోను, వీటిని చిన్నవిగా పెద్దవిగా వొకటొకటిగా వొకటికి రెండుగా చేర్చడముతోను, బొర్ల వేయడము వెలికిల వేయడము కుడికి నిలపడము యెడమకు నిలపడము మొదలైన పనులు చేయడముతోను, అడ్డగీత నిలువుగీత వాలుగీతలను అచ్చటచ్చట వాడడముతోను, మనయక్షరాలన్నీ గుణింతాలతోనూ, వత్తులతోనూ, అంకెలతోనూ తీర్చవచ్చును. వంపులనుబట్టి వీటినన్నిటినీ వర్గాలుగా యేర్పరచుకొంటే పెద్దవాళ్ళకు చాలత్వరగా వీటిమీద గురి నిలవగలదు. క్రొత్తయక్షరము నేర్పునప్పుడు యే వంపులు యెట్లు చేరినవో విద్యార్థిచేత చెప్పించితే బాగా జ్ఞాపకముండును. నా మొదటిపుస్తకమున యీ వివరాలకు వుదాహరణములు చూడనగును.

రెండవసంగతి. తెలుగు వ్రాయడమూ చదవడమూ మొదలు పెట్టడానికి గంపెడక్షరాలు రావలె ననుకోవడము తప్పే. పదమూడు అక్షరాలు, కొన్ని గుణింతములు నేర్చిన యెడల భాగవతములోని "కల డందురు దీనులయెడ" ననే పద్యాన్ని వ్రాయనగును. అక్షరాలన్నీ రావలసినమాట నిజమే కాని కొంతదూరము పని సాగిపోయి చదువులో రుచి పుట్టడానికి తెలుగులో కొన్ని యక్షరాలే చాల యవసరము.

తెలుగు తేటయనే మాట లోకమున ప్రమోగి పోయింది. సాదా వ్యవహారమున ఖ, ఛ, ఠ, థ, ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ (వీనిని మహాప్రాణములందురు) ఙ, ఞలు మనము ప్రయోగించుట అరుదు. క, గ, చ, జ, ట, డ, ణ, త, ద, న, ప, బ, మ, య, ర, ల, ళ, వ, స హాలు మన దినసరి కతను నడుపగలవు. కాబట్టి వీటిని మొదట పరిచయముచేసి, తరువాత యెక్కడోగాని రాని కటువు అక్షరములు నేర్పవచ్చును.

ఉరుదూ సంపర్కము యింగ్లీషు సంపర్కములచేత మన లిపిలోని మహాప్రాణాలకు కొంతవిస్తార ప్రయోజనము కలుగుచున్నది. ఇంగ్లీషు, అదే రోమన్‌లిపి 'ఎఫ్' కును, పుర్దూలిపి 'ఫె' కును మనము 'ఫ' వాడడ మారంభించినాము. పుర్దూలోని 'ఖాఫ్' స్థానమున 'ఖ' వాడుచున్నాము. 'థ' కును రోమను లిపిలోని 'టీహెచ్' సంయోగోచ్చారణ వుండడము చేత కొంత దీని వ్యాప్తియు పెరుగవలసి యుండినది. కాని తెలుగులోనే దీనిని కడుపులో చుక్క లేని 'ధ' మ్రింగిపోతున్నది. ఆకారములోను, పలుకులోను రెంటను సన్నిహితత్వముండడముచేత థకారమునకిక 'ధ' యే నిలుచునేమో ?

'ఝ' సాధారణముగా తెలుగునరాదు. కావున దీనిని తుదకు త్రోయుట మంచిది.

మరియొక చిత్రమైన సంయుక్తాక్షర మున్నది. అది జ్ఞ. ఈశబ్దము వచ్చుటకు పూర్ణానుస్వార ముపయోగించుట కవకాశము లేదు. కాని ఈ 'జ్ఞ' తెలివికి సంబంధించిన

అర్థముగల పద్యములలోతప్ప మరి యెక్కడను వున్నట్లు కానరాదు. అందుత దీనిని తుది పాఠాలలో చేర్చడ ముత్తమము.

విసర్గ 'ః' కొన్ని సాంస్కృతిక పదముల మధ్యన వచ్చును. యిది లేకున్నను దీనిస్థానమున 'హ' కారముపయోగించినను పని జరుగును. నిజమునకు కన్నడములో హాకార (ಐ ) మిది. దీనిని నిలువబెట్టి విసర్గచేసిరేమో యన్పించును. కాని యిప్పటిఅచ్చులోను వ్రాతలోను 'ః' తప్పదు. కాబట్టి దీని స్వరూపము తుదిపాఠాలలో చేర్చవలెను.

తెలుగువ్రాతలో బండి 'ఱ' తరచు వ్రాయుటకలదు. ఇది యెచ్చట వ్రాయతగును? యెచ్చట వ్రాయరాదు? అనే సంగతిలో పండితులే తర్కవితర్కాలు పడుచున్నారు. జాబితాలు తయారు చేసుకొంటున్నారు. కాబట్టి ఆరంభకులకు, అందులో వ్యవహారానికి అక్షరాలు నేర్చేవారికి దీనిని బోధించ పనిలేదు. కాని అచ్చుపుస్తకాలు చదువునప్పు డిది యెదురు పడడం తప్పదు. కావున దీని స్వరూపము పరిచయ పరచడ మావశ్యకము. కడపటి పాఠాలలో దీనిని నేర్పవచ్చును.

తెలుగులిపిలోని మరియొక గుర్తు అరసున్న. అరసున్నను కుడిమొగముచేసి యుంచిననే మనలిపిలో అరసున్న యందుము. యిదియెచ్చటెచ్చట నిలువవలెననే విషయములో పండితులలో తర్కవితర్కాలున్నవి. బండి 'ఱ' విషయములోనైనా కొంచెము బలువుగా పలకడమనే వుపయోగముంటే వుండవచ్చుగాని యీ యరసున్న వట్టిమూగ. మన అచ్చు

పుస్తకాలలో ఇది తప్పదు. దీనిని చూచి చదువరి యిది యేమోయని బెంగపెట్టకోకుండా వుండడం కొరకు యిది కనిపిస్తుందనీ, కాని సాదాపనులకు యిది లేనట్లే వ్యవహరించుకో వచ్చుననీ తెల్పడ మవసరము. ఈ విషయముకూడా కడపటి పాఠాలలో చేర్చడము మంచిది.

తెలుగు వత్తుల విషయమిక్కడ వొకమాట చెప్ప దగును, వట్రసుడి, కావత్తు, తావత్తు, నావత్తు, క్యావడి, క్రావడి, లావత్తు, వావత్తు వీటికి ప్రత్యేకము గుర్తులున్నవి. అవి క్రమముగా నేర్పదగును. తక్కిన వత్తులన్నిటికీ అక్షరపు తలకట్టు తీసివేసి మిగిలిని రూపాన్ని ముందటి యక్షరము క్రింద వుంచడము తప్ప చేయవలసినది లేదు. అందులోని కొన్ని స్వల్పమగు మార్పులుటావత్తిచ్చేటప్పుడు 'ట' మీది నిలువుగీత పెట్టవద్దనీ, పావత్తు వుత్త్వముతో రావలసి వచ్చినప్పుడు ముందక్షరానికి వుత్త్వము పెట్టక వత్తుప్రక్కన వుత్త్వముంచమనీ అప్పటికప్పుడు నేర్పవచ్చును.

ఙ, మ, ఞ, ణ, న అనే అన్ని యనుస్వారముల తావులోను పూర్ణానుస్వారము వాడుకలో వుంది. యిది తెలుగు పొందిన వరప్రసాదము. దీని బోధకు తగిన యేర్పాటు మొదట పాఠాలలోనే చేర్చుకోవలెను.

వ్యవహారములో మనకు యింగ్లీషుఅంకెలు అలవాటయిపోయినవి. కాన వానిని గూడ తెలుగు అంకెలతో పాటు యీ పాఠములలోనే పరిచయము చేయించడము అవసరము. అంతేకాకుండా పెద్దలైన [illegible] కొంతవరకు

లెక్కపద్దు వ్రాసుకోడమూ తెలిసియుండవలసినదే. కాని ఆపనియంతయు మొదటనే తీర్చడానికి రాదు. వ్రాయనూ చదువనూ నేర్చిన తరువాత రెండవవర్గములో విజ్ఞానవిషయములూ, లెక్కలు వగైరాలు సిద్ధపరచి యివ్వనగును.

పదములు నేర్పునప్పుడు వొక్కొక్కపదమును ఆధారము చేసికొని అనేక విషయములను బోధించుటకు వీలుండును. కాబట్టి బోధకుడు పాఠము మొదలు పెట్టుటకు ముందు తాను పరిశ్రమ చేసి యుండినచే గొప్ప సంగతులు చెప్పవచ్చును. గ్లోబొకటి, మనదేశ పటమొకటి, తరగతిలో సిద్ధముచేసియుంచుకొనవలయును. విజ్ఞానమునకు సంబంధించిన యెన్ని పటములు, బొమ్మలు సమకూర్చనగునో, వానిని (పత్రికలోనుంచి కత్తిరింపులైననుసరే) అట్టల కంటించి విద్యాలయావరణలో చేర్చియుంచుట మేలు.

### పదముల నేర్పుట - వుదాహరణలు

చూడుడు. 'మల' యను పదమున్నదనుకొనుడు. దీనికి కొండయని అర్థము. నల్లమలలని, యెర్రమలలనీ, ఆనైమలలని మనరాష్ట్రమున వున్నవి. ఏడుకొండలవాడా అని వెంకటేశ్వరు నందుము. అరవములో యేడుకొండలను ఏళుమలై అందురు.

పటముమీద మలల నెట్లు చూపుదురను సంగతి చెప్పి యీ మలలను జూపి వీనివిషయము కొంత చెప్పవచ్చును.

తిరుపతికొండల బొమ్మలు, నల్లమలలలోని మహానంది, శ్రీశైలము, అహోబిలము బొమ్మలు దగ్గరున్నయెడల చూపవచ్చును.

'అల' యను పదము వున్నది. సముద్రపటమున్న యెడల అందులోని అలలను కనుబరచవచ్చును. విజ్ఞానశాస్త్ర ప్రకారము అల లెట్లు పుట్టునో చెప్పి చంద్రసూర్యుల ఆకర్షణ అమావాస్యనాడొకేవైపున నుండుటచే అలలు పెరుగుట యెట్లు సంభవించునో వివరింపవచ్చును. 'మర' అను పదము వున్నది. యీ దినము పిండిమరలు లేనిచోట్లే అరుదు కాబట్టి పిండిమర వుదాహరణం సులభంగా చూపవచ్చును. ఆమరలో పిండి విసరడము యెట్లు జరుగుతుందో చెప్పవచ్చును. ఎలెక్ట్రిక్ శక్తి బిసపెట్టినపుడుగాని చక్రాలు తిరుగవు. అందులో పని జరుగడానికి శక్తి యెన్నివిధాల దానిని సమకూర్చవచ్చునో చెప్పనూ వచ్చును.

ఇట్లాటి విషయాలు పదమును చూపించి పాఠమును ఆరంభించకముందే యిష్టాగోష్ఠిగా, తమాషాగా కబుర్లు చెప్పినట్లుగ చెప్పి పదమును యెదుటబెట్టితే యింకాయెక్కువ ఆకర్షవంతంగా వుంటుంది.

గమనించదగిన వుచ్చారణలు

మనభాషలోని కొన్నిలిపుల వుచ్చారణ పిన్నలు పెద్దలుకూడా అనేక ప్రాంతములలో చాల విపరీతముగా చేయుటకలదు. దంత్యతాలవ్య చ, జలు మొదట గమనింప

దగును. పిదప స, శ, ష లెచ్చటెచ్చట పల్కనగునో జాగ్రత్తగా నేర్పవలెను. లేనిచోట వత్తిపల్కడము - భేదమును బేధము చేయడము వగైరా - మాన్పించదగును. "నీవష నన్నష శతవృద్ధన్నావష" అని 'ట' ఉండవలసినచోట్ల వైదికులు 'ష' పల్కుదురు. ఇట్టివి తగదని బోధించవలెను.

రెండు నెలలలో

నలుబది లేదా నలుబది యయిదు దినముల అభ్యాసముతో, అంటే సెలవులు వగైరాలతో చేర్చి రెండునెలలలో వ్రాయనూ చదువనూ నేర్పవచ్చును. ఇదేదారి, వేరే లేదని గడుసుదనము చేయడము నామతముగాదు. నేనూ వొకదారి తీసినాను. ఇది బాగా పనికివచ్చునని నానమ్మకము. పదుగురిదే మాట యాడితే పరిపాటి యవుతుందనేది నాయాశ.

# ౬. అక్షరాస్యత సాధించుటకు పరికరాలు

చదువులు నేర్పించడానికి కొన్ని పరికరాలు వుంటేనే కాని కార్యసాధన చేయుటకు వీలుకాదు. ఆ పరికరాల వివరాలు కొంతకు కొంత యీ క్రింద తెలియపరచుచున్నాను. ఆయా స్థానిక పరిస్థితులను బట్టి ప్రత్యామ్నాయ పరికరాల్ను సమకూర్చుకోవచ్చును.

### నల్లబల్ల, సీమసున్నము

ప్రతి వయోజన విద్యాకేంద్రంలోను రెండు నల్లబల్లలుండడం అవసరం. యిందులో వొకటి తరగతుల పాఠాలు చెప్పేదానికి వుపయోగించుకొనవచ్చును. రెండవది గోడ వార్తాపత్రికను వ్రాయడానికి వుపయోగించుకొన వచ్చును. గోడమీద స్థలముచేసి సిమెంటుతోనో యితరత్రానో నల్ల పూతపూసి గోడవార్తాపత్రికను యేర్పాటు చేసుకొనేపక్షానికి రెండవ నల్లబల్ల అనవసరము. మొదటి నల్లబల్లసందర్భములో కూడా తరగతి స్థలములోనే యిట్టి యేర్పాటు చేయగలిగితే నల్లబల్లకు బదులుగా వినియోగించవచ్చును. కాని వొక నల్లబల్ల వుండడం అనేక కార్యాలకు వుపయోగం. వొకస్థలాన్నుంచి వొక స్థలానికిమార్చి కేంద్రానికి బయటకూడా పెట్టి ప్రకటనలు, కార్యక్రమాలు ప్రజలకు తెలియజేయడానికి యిది బాగా వుపకరించును.

సీమసున్నము తెల్లది కొంత యెక్కువగాను, రంగుగలవి కొంత తక్కువగాను సేకరించి పెట్టుకొనవలెను. వీలైన చోట్ల తెల్లసున్నంపెట్టె వొకటి, రంగులసున్నం పెట్టె వొకటి వుంచుకోవడంమేలు. వార్తలను కంటికింపుగా రంగులు మార్చివ్రాయడానికి రంగుల సీమసున్నము వుపయోగపడుతుంది. యేకారణము చేతనైన రంగుల ఛార్టు చేతలేకపోతే రంగుసున్నపు కోపులతోకూడా పటములో చిత్రించే మాదిరిగానే అక్షరాలు, బొమ్మలు చిత్రించి కార్యక్రమము నడిపించుకొనవచ్చును.

## బాగా వెలిగే దీపము

ప్రతి వయోజన కేంద్రములోను బాగా వెలిగేదీపమునకు యేర్పాట్లు చేసుకోవడం అవసరం. సాధ్యమైతే పెట్రోమాక్సులైటు సంపాదించుకొనుట మేలు. ఇది యెల్లప్పుడు సులభముకాదు. మంచిలాంతర్లు రెండుసంపాదించుకొంటే పెట్రోమాక్సుకు బదులుగా వినియోగించుకొనవచ్చును. చదువుకోడానికి వచ్చే పెద్దలలోనే తప్పకుండా తమ లాంతర్లు తెచ్చుకొనేవారు దొరికితే యెన్ని లాంతర్లు వచ్చినా సంతోషించవలసినదే.

## అక్షరాభ్యాస పటములు

ఉపాధ్యాయుడు వయోజనులకు చిత్రములతో కూడిన పదముల సహాయమున అక్షరములను నేర్పుటకు ప్రత్యేకంగా యేర్పాటైనఛార్టును, అంటే అక్షరాభ్యాస పటమును వినియో

గింపవలసి వుండును♦. దానిద్వారా నేర్పిన అక్షరాలను, గుణింతాలను అభ్యాస పరచడానికి అప్పటికప్పుడు తయారు చేసుకొనిన పదములు, వాక్యముల పటములు అవసరము. ఇవి బోధనాభ్యాస కాలమునందే శిక్షణకేంద్రములో వుపాధ్యాయునిచేత సిద్ధము చేయించుట కలదు. అట్లు సిద్ధమైన వాటినిగాని, తాను స్వయముగా సిద్ధము చేసుకొన్న వాటినిగాని ఆరంభము నుంచి మెట్లు మెట్లుగా తయారుచేసి, సాధ్యమైతే అట్టలమీద అతికించి వరుసగా గోడలమీద వ్రేలాడగట్టి ప్రదర్శిస్తే వొకరికి మరియొకరు విద్యచెప్పే పద్ధతి అమలులో పెట్టేటప్పుడున్ను యితరత్రానూ చాలా మంచి వుపయోగ ముండును.

## భూగోళ పటములు

ప్రయోజన కేంద్రములో లోకానికి సంబంధించిన సర్వవిషయాలూ వార్తలు, కథలు వగైరా రూపాలలో బోధించడము తప్పదు. కాబట్టి లోకాన్ని గుర్తుకు తెచ్చే భూగోళ పటాలు కేంద్రములో వుండడము అవసరము. ప్రపంచ పటమొకటి, ఇండియా పటమొకటి, తమ రాష్ట్ర, జిల్లా పటములు, ఇంతవరకైనా వుపాధ్యాయుడు సంతరించి పెట్టుకొనవలెను. వొక గ్లోబునుకూడా సంపాదించడ మవసరము. యెంతవిరివిగా పటాలు సంపాదించి గోడలకు వ్రేలాడవేసుకుంటే అంత ప్రయోజనకరము.

♦ నేను సిద్ధముచేసిన ప్రయోజన అక్షరాస్యత పటము పనికివచ్చును.

### పుస్తకములు

వయోజన కేంద్రమునందు వయోజనవిద్య - మొదటి పుస్తకము చదువరులు యెందరుంటారో అన్ని ప్రతులు పెట్టుకోవలెను. బోధకుడు తన వుపయోగార్థము "వయోజనవిద్య - బోధనక్రమము"ను తనవద్ద నుంచుకొనుట మేలు. వయోజనులు చదవడానికి నేర్చుకొన్న తరువాత పరిశ్రమ చేయడానికి ప్రత్యేకముగా తయారుచేసిన సులభగ్రంథాలు వొకసెట్టు సంపాదించి వుంచుకొనవలెను. యింకా యేవయినా తేలికరచనలు సేకరించి పెట్టుకొంటే మేలు. దినపత్రికలలో పెద్ద అక్షరాలతో వ్యాసాల ఆరంభములో ప్రకటించే సంక్షేప విషయాలు కత్తిరింపులు చేసి పెట్టుకొంటే సందర్భముకొద్దీ సద్వినియోగము చేయవచ్చును.

### ప్రబోధ పరికరాలు

ప్రతి వయోజన కేంద్రములోను మెగఫోను అంటే శబ్దాన్ని బలవత్తరముచేసే బూర వొకటి వుండవలెను. గ్రామములో ప్రచారము చేయవలసి వచ్చినప్పుడు వుపకరించడానికిగాను ప్రచార నినాదాలను పెద్ద అక్షరాలతో వ్రాసి అట్టలకో తడక ముక్కలకో అంటించి కర్రలకు కట్టి సిద్ధము చేసుకొనవలెను. ఇంతేకాదు. వయోజన విద్యను గురించి పెద్దలు మనోరంజకముగ చెప్పిన సూక్తులను పై విధముగానే తయారు చేసుకొనవలెను.

వెలగల వుపకరణాలు

వయోజనవిద్యలో గ్రామఫోను, మ్యాజికులాంతరు, తగిన స్లైడులు చాలా వుపయోగపడును. కాని ప్రాక్టికల్ వయోజనవిద్యా బోధకుడును వీటిని సంపాదించుకోలేడు. కాబట్టి అయిదారు కేంద్రాలకు ప్రాక్టికల్‌జత వీటిని తెప్పించు కొంటే అందరూ సమిష్టిగా వినియోగించుకొనవచ్చును.

మరియొక తెగ పరికరాలుకూడా వయోజనవిద్యలో వుపయోగ పడగలవు. విజ్ఞానశాస్త్ర విషయములు బోధించే టప్పుడు చూపవలసిన వుష్ణమాపక యంత్రము (థర్మామీటరు), వాయుభారమాపక యంత్రము (బెరామీటరు) వగైరాలు యీ వర్గములో చేరును. ఇవికూడా ప్రాక్టికల్ బోధకుడు తెప్పించుకొనుటకు సాధ్యమయినవికావు. కాబట్టి తన చదువరులను యితడు యిట్టి పరికరాలు వుండేచోటికి తీసుకొని పోవలెను. ఇవి సాధారణముగా ప్రతి హైస్కూలులోను వుండును. విరామము వున్నప్పుడు తన చదువరులను ప్రక్క హైస్కూలుకు యాత్రగా పిలుచుకొనిపోతే అక్కడి విజ్ఞానశాస్త్ర పండితులను సహాయముకోరితే వారు చక్కగా బోధపడేటట్టు వివరణతో సహా యీ వుపకరణములను చూపుదురు.

యితర హంగు

చదువులు నేర్పించడముతో కూడా విషయజ్ఞానము, లోకపరిచయము వయోజనునికి కలిగించవలెననడం మన వుద్దే

శము. కాబట్టి అతనికి తెలియవలసిన విషయాలు జాబితా చేసి అందులో నిపుణులైన వారిచేత కేంద్రముదగ్గర వుపన్యాసాలిప్పించడము కర్తవ్యము. నాలుగు మాసాలు చదువు చెప్పితే యిట్టి వుపన్యాసాలు నలుబదియైనా యేర్పరచడం అవసరము. గ్రామారోగ్యము, పారిశుద్ధ్యము, వ్యవసాయము, పశుపాలనము, పంచాయతులు, సహకారసంఘాలు, విద్య, గృహపరిశ్రమలు, ప్రజల ఆటలు-పాటలు, దేశచరిత్ర, భాషలోని మంచి మంచి గ్రంథాలు, పుణ్యక్షేత్రాలు, పురాణాలు, వ్యాయామము, చిత్రమైన విమానాలు, పొగవోడలు, రైళ్ళు యిటువంటి అనేక విషయాలను గురించి సులభమైన భాషలో వుపన్యాసాలు చెప్పించవచ్చును.

కేంద్రమునకు సహాయక సంఘము

ప్రతి వయోజన విద్యాకేంద్రానికిన్నీ వొకసహాయక సంఘమును ఏర్పాటు చేసుకోవడం అవసరము. యిందులో పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, కోఆపరేటివ్ సొసయిటీ ప్రెసిడెంటు లేదా కార్యదర్శి, గ్రంథాలయ అధ్యక్షుడు లేదా కార్యదర్శి, గ్రామమునసబు, కరణము, హెడ్మాష్టరు, పలుకుబడిగల వూరిలోని యితర పెద్దలను చేర్చి సహాయక సంఘమును యేర్పాటు చేసుకొనవలెను. వీరందరు అందులో వుండవలెననే నిర్బంధ మక్కరలేదు. యెందరు అనుకూలపడితే అందరినీ చేర్చుకోవచ్చును. సాధారణంగా తొమ్మిదిమంది కంటె యెక్కువ వుండరాదు. వీరు కేంద్రానికి సర్వవిధముల తోడ్పడవలసినవారు. వారివారి యిష్టానుసారము

వొక్కొక్క పని వొక్కొక్కరు చూస్తామని వొప్పుకుంటే యింకా మంచిది. అందరూ వయోజనులు చదువరులు కావడానికి తగిన వుత్సాహము కలిగించడానికి పనికివత్తురు. వీరు తమలో తాము వూరి వీధులను పంచుకొని తమ భాగాలలో యింటింటికీ పోయి యిండ్లవారిగ అక్షరాస్యులు కాని వారిని వేరువేరుగా జాబితా తయారు చేసుకొనవలెను. ఆ తరుణములోనే వయోజన విద్యాలయము పెట్టేకాలము, స్థలము వగైరాలు వివరిస్తూ చదువురానివారు చదువుకోటానికి రావలసిందని ప్రచారము చేయవలెను. పాఠశాల ఆరంభించే దినము వీధివీధికి వుత్సవముతో బయలుదేరి ప్రబోధము చేయవలెను. వార వారము యిట్టి వుత్సవాలు బయలుదేరదీయడం మేలు. యింకొకమాట. వూరిలోని విద్యావంతులను చేర్చి వారికి వయోజనవిద్యా పద్ధతులను గురించి వుపన్యసించి కేంద్రానికిరాని, రాలేని, నిరక్షరాస్యులకు వొక్కరికొక్కరు నేర్పునట్లు ప్రోత్సహించవలెను. అంటే ప్రతియూరా వయోజన విద్యాబోధకుల ఐచ్ఛికదళాలను యేర్పరచుకొనవలెను. యీ విధానాన్ని వుత్తర ఆర్కాడుజిల్లా చెంగం ప్రాంతంలో 22 గ్రామాలలో విరివిగా వుపయోగించి కొంత ఫలమును సాధించగలిగినాము.

# ౭. ప్రచారము

'సత్యంవద', 'ధర్మంచర' అని మన పెద్దలు వేదాలలోనే అనుశాసించిరి. కాని వారంతటితో తృప్తిపొందలేదు. ఆ అనుశాసనాన్ని లోకముచేత అనుసరింపజేయడానికి వేయి విధాల ప్రచారముచేసినారు. కథలు, పురాణాలు, నాటకాలు, పద్యాలు, పాటలు యెన్నెన్నో యుగయుగములోను కల్పించి యీ మాటలు మానవుల చెవి కెక్కునట్లు ప్రయత్న పడినారు. ఇంత ప్రయత్నముతో గూడా యీ అనుశాసనాన్ని అతిక్రమించేవారికి నరకాలు కల్పించి భయమునుకూడ సాధనంగా వుపయోగించినారు. అంటే నయాన భయాన రెంటను సంఘానికి మానవుణ్ణి వుపయోగపడేటట్లు చేయడానికి పడరాని పాట్లన్నీ పడినారు.

తరతరాలుగా, యుగయుగాలుగా మన పెద్దలుచేసిన యీ పని అంతా ప్రచార కార్యక్రమానికి దృష్టాంతము. నిజానికి భారతభూమిలో పుట్టిన శిశువు ప్రపంచములో ప్రవేశించినది మొదలు, దేహము వదలిపెట్టేవరకు గూడ అహరహము 'సత్యంవద' 'ధర్మంచర' అనేముక్కల యర్థము అతని చెవికి గోచరము అగుచుండుటకు తగిన యేర్పాటులు మనవారు చేసిరంటే ప్రచార కార్యక్రమములో మన పెద్దల కెంతవిశ్వాసముండినదో స్పష్టపడుతుంది. ప్రహ్లాదుడు తల్లి కడుపులో వుండగానే అతనికి ధర్మోపదేశము జరిగిందట! ఉపదేశము, వుపదేశము, వుపదేశము, ఇదే మన పూర్వీకుల

సాధన. అక్షరము నేర్చినదోడనే యే గ్రంథము తిరగవేసినా మన వాఙ్మయములో యీ 'సత్యంవద' 'ధర్మంచర' అను సందేశపు టర్థమును స్ఫురింపజేసే ఘట్టాలే కంటికి గోచరించక తప్పవు.

కన్ను, చెవి, ఒకటిరూపాన్ని, ఒకటి శబ్దాన్ని మనసున కందించడముచేత యివి జ్ఞానవిజ్ఞాన సాధనకు ముఖ్యమయిన యింద్రియాలుగా యేర్పడినవి. లలితకళ లనిపించుకొన్న సంగీతము, కావ్యము, చిత్రము, శిల్పము యీయన్నిటి యాస్వాదనానికిని యీ రెండంగాలే సాధనాలు. కాబట్టి మనస్సుకు యొక్క చిత్తవృత్తిని సంస్కరింపవలసిన యేపని సాధింపబూనినప్పటికినీ యీ రెండు అంగాలనే పరమాధారంగా మనపెద్ద లుపయోగించినారు. మనమును వుపయోగించవలసి యున్నది.

వీటి వుపయోగములో యేదిముందు, యేది వెనుక యేది ముఖ్యము, యేది అముఖ్యము అనే తర్కములోనికి దిగ నవసరములేదు. నిజానికి అన్ని యనుభవముల కూడికే మానవుడు. యీ యనుభవముల పూర్వాపౌర్యనిర్ణయాలు చేయబూనడము మానవజీవితప్రవాహాన్ని విభాగించడ మవుతుంది. వున్న సాధనాలన్నిటిని సాధ్యమయినది సాధ్యమయినప్పుడు వుపయోగించి మానవజీవితాన్ని పరిపక్వావస్థ చెందించు ప్రయత్నం చేయవలసియున్నది. 'వ్రతానాముత్తమం వ్రతం' అని వొక్కొక్క వ్రతానికిని దానిదాని స్థలంలో

వుత్తమత్వము చెప్పినట్లు 'సాధనానాం వుత్తమం సాధనం' అని మనము చెప్పుకోవలసి వస్తుంది.

శ్రవణవిధానము మనకు అనుశ్రుతంగా వచ్చింది. అంటే చక్షురింద్రియోపయోగమును మనవారు ప్రోత్సహింపలేదని అర్థముకాదు. మన దేశములోని అజంతా, యెల్లోరా, మహాబలిపురము, అమరావతి, లేపాక్షి యిత్యాది సుప్రసిద్ధ స్థానాలలోని శిల్పములు, చిత్రములు, ప్రపంచప్రజల నందరిని ఆకర్షించినవి. మన ప్రాచీనదేవాలయాల శిల్పము, గుళ్ళ గోడ, పైకప్పులమీది చిత్రాలు, తుదకు రథాలమీద వేసే కప్పుగుడ్డలపైన చిత్రాలు అన్నీ కంటి నుపయోగించి మానవుని జ్ఞానవంతునిజేయ నేర్పడిన సాధనాలే.

పాశ్చాత్యదేశాల సంపర్కముచేత అచ్చుయంత్రాల వ్యాప్తిచేత, గ్రంథసామగ్రి పెంపుదలచేత చక్షురింద్రియోపయోగము అంటే అక్షరరూపదర్శనము అనే ప్రత్యేక భావమేర్పడియున్నది. ఆ భావాన్నికూడ మన పెద్దలు గ్రహించిరి. వారు అక్షరమును బ్రహ్మగా వ్యవహరించిరి. 'అ' 'ఉ' 'మ్' లతో చేరిన ఓంకారమును ప్రత్యక్షము చేసుకోడమే బ్రహ్మను సాక్షాత్కరింప జేసుకొనడ మనిరి. వర్ణమాలలోని ప్రత్యక్షరమునకును వొక విలక్షణమగు తాత్త్విక సంబంధ మేర్పరచి దానిని మోక్షప్రదము కావించిరి. కాని మనకు సంభవించిన పరాధీనత కారణంగా మనలో అక్షరజ్ఞతే నశించిపోయి యెన్నడయినా మనవారు అక్షరజ్ఞులుగావుండిరా

అనే సందేహములో పడిపోవలసిన దుర్గతి మనకు పట్టినది. అశోకమహాచక్రవర్తి కాలమునాటి సంగతి యిదివరలోనే వివరించడ మయినది.

అయిన అక్షరము అనేటప్పటికి అది రూపకల్పనయగు చున్నది. అందులోనూ యిది చిలుకను వ్రాసినట్లు, సింహ మును వ్రాసినట్లు, సుందరస్త్రీని చిత్రించినట్లు, తీర్చే రూప కల్పనకాదు. యేనాడో సహజవస్తువుల బొమ్మలే అక్షరా లుగా వుపకరించిన వన్నమాటకలదు. కాని నేడు అక్షరాలు —యేభాష వర్ణసమామ్నాయము నాలోచించినా—వట్టి సాం కేతికాలుగానే యేర్పడినవి. సహజరూపాలను చిత్రించే శిల్ప కళలోనే కాలము మార్పుతో సాంకేతికా లేర్పడి అందు లోని పండితులు 'దీనిభావమేమి తిరుమలేశ ?' అని ప్రశ్నిం చుకొని దొమ్ములాడే పరిస్థితి సంప్రాప్తించినది ! అక్షరసమా మ్నాయాలలో అట్టి దొమ్ములాటకు తావులేదు. కారణమే మంటారా? ఇందులోని సాంకేతికత్వము స్థిరపడి పోయినది. వీనికి కట్టుదిట్టాలు మొదట బాగుగా యేర్పడినవి. కాని సాం కేతికాలు సాంకేతికాలే. పుట్టినపిల్ల సహజంగా యితరులు చెప్పక తల్లిమాటలను, తల్లిముఖాన్ని పోల్చుకొన్నట్లుపోల్చు కోడానికి రానివి.

అందుచేత కన్ను గ్రహింపవలసిన అక్షరము ప్రచా రము కావలసి యున్నప్పటికిని మరియొక నోటిమాట శ్రవ ణేంద్రియము మూలకంగా మానవుని మనసునకెక్క చక్షు

రింద్రియానికి శిక్షణ నివ్వవలసియున్నది. కాబట్టే జ్ఞానవిజ్ఞాన సాధనకు నేటిపరిస్థితులలో అక్షరజ్ఞత అత్యవసరమయియున్నా, మన దేశములో అక్షరజ్ఞత అడుగంటి యుండడముచేత దాని పునరుద్ధరణకును, తద్వారా గ్రంథాలయ పఠనాలయోద్యమ విజృంభణమునకును ప్రజలను పురికొల్పడానికి ముఖ్యంగా వారి చెవులలోకి దూరేటట్లు గొప్ప ప్రచారముచేయడ మవసరము. అక్షరజ్ఞతవలని ప్రయోజనములు, గ్రంథాలయ పఠనాలయ ముల వలని ప్రయోజనములు కంటికి కట్టినట్లుగా కనుపరచే పటాలు బొమ్మలువేసి చూపి వివరించడము, మ్యాజిక లాంతరు, సినిమా ఫిల్ములద్వారా ప్రదర్శించి నచ్చ జెప్పడము యిన్నీ చేయదగినవే. యిన్నీ చేయడము అక్షరాలు రాని వారికొరకే గాదు. అక్షరాలువచ్చికూడ గ్రంథాలయమెచ్చ టుందో తెలియనివారు, గ్రంథాలయ మెట్లుపయోగించుకొన వలెనో తెలియనివారు, గ్రంథపు పూర్ణోపయోగము పొంద డానికి యేవిధంగా దానిని వుపయోగించవలెనో తెలియని వారు చాలమందియున్నారు. అంతేకాదు, వీరిలో చాలమంది నిరక్షరాస్యతచే కలిగే నష్టాలు, అక్షరాస్యత వుపయోగాలు కూడా తెలియక తాము నేర్చిన చదువు, వ్రాత తమయింటి లోని యింటి ప్రక్కలోని నిరక్షరాస్యులకు నేర్పే వుత్సాహాము పొందలేకున్నారు. యిట్టివారందరిని ప్రబోధించడానికి చెవికి, కంటికి రెంటికీ ఆనే తీక్ష్ణప్రచారం నేడావశ్యకంగా వుంది.

ఇట్టిప్రచారానికి అనుసరింపదగిన మార్గములేవి ? అను ప్రశ్నకు జవాబు చెప్పుకోవడములోనే మనప్రతిభ కనుపరచ

వలసియున్నది. నిజమునకు యిదే మార్గమని వొక్కమా ర్గాన్నే చూపగల మనడము పొరబాటు. మానవుని మెదడు అన్ని శాస్త్రాలలోను క్రొత్తక్రొత్త విషయాలను కనిపెట్టుచున్నట్లే ఆ నిమిషానికి ఆ పరిస్థితికి అనుకూలమేదో ఆయా మెదడు ప్రచారకార్యక్రమములో కనిపెట్టుకుంటుంది. కావలసిన దేమిటంటే వయోజన బోధకునిలోనూ ప్రతిగ్రంథాలయ సేవకునిలోను తన వుద్యమము అనంతముఖాల విజృంభించవలె ననే వ్యగ్రోత్సాహము నెలకొనవలెను. అప్పుడు యిదివరలో మనదేశములోను, యితరదేశములలోను తన వుద్యమములోను, యితరోద్యమాలలోను ప్రచార కార్యక్రమానికి అనుసరించిన మార్గము లేవిగలవో తానుగట్టిగా పరిశోధించి కనుగొంటాడు. మననం చేస్తాడు. తనకుండే అనుకూలాలతో తనకు సంప్రాప్తమయ్యే భిన్నభిన్న పరిస్థితులలో తనచేతికందే పరికరాలతో యేమిచేయవచ్చునో నిర్ణయించుకొంటాడు. దానిని సాధిస్తాడు. మనము కూర్చున్న చోట కూర్చున్నట్లుగా మనతో యిష్టాగోష్ఠిగా మాట్లాడుతుండే మిత్రులకు ఆ మాటలలోనే మన గ్రంథాలయోద్యమ విషయము, వయోజనవిద్య విషయము ప్రస్తావనకు తెచ్చి సంగతులు ప్రకటించటము ప్రచారములోని మొదటిమెట్టు. ఒక్క విషయము జ్ఞాపకముంచుకొంటే యిష్టాగోష్ఠి ప్రసంగాలలో యెంత కార్యక్రమము తీర్చవచ్చునో అర్థమవుతుంది. మానవుడు వొక్కనితో నొక్కడు యేవిషయము మాట్లాడుకొన్నా విజ్ఞానమునకు సంబంధము కలియకుండా వుండదు. యేదో నాలుగు నిమిషాలలో తనపని పూర్తిచేసు

కొని పోదలచి వచ్చిన వ్యవహారధోరణి మానవుని ప్రసంగ మునకు దించి మనము ప్రచారము చేయలేక పోవచ్చును. కాని ప్రశాంతంగా మనతో ముచ్చటించే మిత్రులకు మన మెన్ని సంగతులయినా తెలియపరచడము సులభసాధ్యము. అందువల్లనే మన పెద్దలు సత్పురుష సాంగత్యమనేది మోక్ష సాధనాలలో గొప్ప సాధనంగా పేర్కొన్నారు. సత్పురుషు డంటే మొద్దబ్బాయి కాడు. ప్రపంచములోని గుణాగుణము లెరిగిన విజ్ఞుడు. యితరులకు మన వుద్యమపు పెట్టిని ప్రాకించ దలచుకుంటే మనమూ అట్టి విజ్ఞులము కావలెను. మన కంటె పెద్దలయిన విజ్ఞుల దర్శనలాభము మూలకంగా, గ్రంథపఠనము మూలకంగా, పత్రికాపఠనము మూలకంగా, సంభాషణ మూలకంగా, యివేవీ కుదరకపోతే వుత్తర ప్రత్యుత్తరముల మూలకంగా అహరహము మనము విజ్ఞతను పొందుతూ వుండవలెను. మనము పొందుతూవుండే యీ లాభాన్ని మనవద్దకు వచ్చేవారికి ప్రసంగవశాత్తుగా అందించడానికీ మన మప్పుడు అర్హులుగా వుంటాము. మనము చేసే వుద్యమ ప్రచారము పటిష్ఠమవుతుంది.

ఈ యిష్టాగోష్ఠి విధానాన్ని మొదటి మెట్టన్నాము గదా! మన దగ్గరికి వచ్చేవా రెంద రుంటారు? కాబట్టి మన వుద్యమము ప్రబలవలెనంటే మనముకూర్చున్నచోటనే పనితీర్చలేము. అందుచేత వుద్యమాన్ని మనము యెవరికొర కుద్దేశించినామో వారివద్దకు మనము తీసికొని వెళ్లవలెను.

యింగ్లీషులో వొక సామెత యేర్పడియున్నది. మహమ్మదు వద్దకు మహాపర్వతమురాకపోతే మహాపర్వతమువద్దకే మహమ్మదు పోవలెనట. అట్లే మనవుద్యమము వద్దకు ప్రజాసామాన్యము రాలేకపోతే, ప్రజాసామాన్యమువద్దకు మనవుద్యమమే పోవలెను. ఒక్కమన వుద్యమముమాటే కాదు. యేవస్తువైనా ప్రజాసామాన్యం తన్నుపయోగించవలెనని కోరితే ఆ వస్తువు ప్రజాసామాన్యాన్ని వెతుకుకొని పోవలెను. ఈ న్యాయాన్ని గుర్తించే పాశ్చాత్యదేశాలలో వస్తుసామగ్రి తయారుచేసి కోటీశ్వరులయిన పరిశ్రమాగారప్రభువు లందరు బ్రహ్మాండమయిన 'అడ్వరుటైజుమెంటు' శాస్త్రాన్ని సృష్టించినారు. ఆ శాస్త్రం చూడతగింది. చదువతగింది. తుదకు మన దేశంలోని 'జాడీబీడీలు', 'కరింబీడీలు' యెందరు పిల్లల కంఠాలలో యెందరు యువకుల టోపీలు దుస్తులమీద యెన్నెన్ని వీధులలో మనకు ప్రత్యక్షమవుచున్నవో చూడండి. దుష్ట వస్తువులతో మనకు పోలికాయని ఆక్షేపింతురా? దుష్ట వస్తువులు మనలను ముంచి వేయుచుండే టప్పుడు వాటి నెదుర్కొనే శక్తి విజ్ఞానసాధకమయిన మన యుద్యమానికి దప్ప యింకొక వుద్యమాని కున్నదా? కాబట్టి మన వుద్యమము దుష్టప్రచారాల నన్నిటిని మించి తాను ప్రచారములోనికి రావలెనుగదా! ఇదితప్పని పరిస్థితి. ఇందులో మనము వెనుకాడరాదు.

మన కుటుంబముల దినసరి కార్యక్రమములోనే వయోజన విద్యాప్రచారమున కవకాశము లున్నవి. పాటలు, పండు

గలు, పేరంటములు, కొలువులు, వివాహాది శుభముహూర్త ములు, అన్నింటిని మనతో జేసి నలుగురకు ఎక్కువవిషయ గ్రహణము కలుగు నవకాశాలుగా తీర్చవచ్చును. స్కూళ్ళు, కాలేజీలు, విశ్వవిద్యాలయములలో వారి విద్యాప్రణాళికకు మించి జరుగు సంఘోద్దీపక వ్యవహారముల మాట నేను చెప్పనక్కరలేదు. భజనలు, బొబ్బిలికథలు, వీథినాటక ములు, హరికథలు, యాత్రలు వయోజన విద్యాప్రచారకు లకు మంచి యవకాశములు. యాత్రల కిప్పుడు క్రొత్త తేజస్సు కలిగినది. ఆంధ్రదేశములో గ్రంథాలయసంఘంవారు గ్రంథా లయ యాత్రలు చేయుచున్నారు. ఆ యాత్రలలో బొమ్మల లాంతరు సహాయముననైతేనేమి, యితరత్రానైతేనేమి విజ్ఞాన విషయము లనేకములు బోధించుచున్నారు. ఈసందర్భము లోనే గ్రంథాలయ పఠనాలయముల మాట కొంత చెప్ప కొననిండు.

నేటిదినము దేశభాషల్లో పఠనాలయములను విరివిగా ప్రోత్సహించుట అత్యవసరము. నూతన యుగవిజ్ఞాన ప్రబో ధకములగు గ్రంథములు నేడు వెలువడుట మన భాషలలో తక్కువ. కారణాలన్నిటిని నే నిచట యేకరువు పెట్టనక్కర లేదు. మీారంద రెరిగినవే. పత్రికలు దినదినము, వార వారము లోక విజ్ఞానాన్నంతా వెదజల్లక విధిలేదు. కాబట్టి అందులోనుండి వివిధ విషయములకు సంబంధించిన వ్రాత లప్పటికప్పుడు కత్తిరించి వేరేవేరే ఫైళ్లుగా అతికించి పెట్టితే చదువరులకు మంచి విజ్ఞానమును పంచి పెట్టడానికి వీలున్నది.

పఠనాలయాల యావశ్యకత యింత వుందంటే గ్రంథాలయాల యావశ్యకత లేదనికాదు. మంచిగ్రంథాలు చేర్చి పెట్టడము చాలకాలముగా అనుభవములో నున్నపని. ఉండగలదు.

పైన చెప్పిన సాధనాలేకాక వయోజన విద్యకు బొమ్మల ప్రదర్శనాలు, వస్తుప్రదర్శనాలు, శిల్పాలు, వుపన్యాసాలు, సినిమాలు, యిట్టి వెన్నియో కలవు. నేడు అన్నిటికంటె యెక్కువవిస్తారంగా వస్తుండేది రేడియో.

రేడియోకు సంబంధించిన అన్ని వివరాలను నేనిక్కడ విమర్శింప దలచుకొనలేదు. యిటీవల పడమటి దేశాలలో ప్రచారములోనికి వచ్చిన 'గ్రూప్ లిజనింగు' అను విధానము చాల వుపయోగకరమని నాయభిప్రాయము. దానికి తగిన సుశిక్షిత సేవకబృందమును మనము సిద్ధము చేసికొని యీ దేశమునందును మన మావిధానము ననుసరించడము లాభప్రదమని నామనవి.

'గ్రూప్' అనగా వొకజట్టు. రేడియోలో చెప్పే విషయాలు విని అవగాహన చేసుకొనే ఉద్దేశ్యముతో కొందరుకొంద రటనట జట్టుగా యేర్పడుదురు. లంకా షైరులో నలుగురు వ్యవసాయదారులు, వొక బేల్ దారు, ముగ్గురు కూలీలు, యిద్దరు బడి వుపాధ్యాయినులు, యిద్దరు లక్ష్ములు, వొక పీనుగల మోతరి, వొక మతాచార్యుడు వొకజట్టు చేరిరి. గం 8-30 రేడియోలో వినుట కేర్పడి

యుండ గం. 8-15 లకు వీరు సమావేశమైరి. జట్టు నాయకుడు రేడియోలో రాబోయే విషయమును ప్రస్తావించెను. యీ జట్టుయెదుట నొకపటము పరచి 'మెడిటరేనియన్', 'పసిఫిక్' సముద్రాలను చూపి కొన్ని వివరాలను చెప్పెను. తరువాత 30 నిమిషములు రేడియో వినిరి. కొందరు కొన్ని గుర్తులను వ్రాసికొనిరి. అది ముగిసిన పిదప యీ జట్టువారు కొంత విశ్రాంతి పొందిరి. తరువాత జట్టునాయకుడు రేడియోలో చెప్పిన సంగతులు కొన్ని వాక్యాలలో సంక్షేపించి అనువదించి విమర్శ యీ సంగతుల మీద జరుగవచ్చునని సూచించెను. జట్టువారు వీటిని విమర్శించడమేకాక, తాముగ క్రొత్త విమర్శన లారంభించిరి. వొక యరగంట చర్చ జరిగిన పిదప నాయకుడు దానినంతయు సమన్వయపరచి యుపన్యసించెను. అందరును యేదో కొంత క్రొత్తవిషయమును నేర్చుకొంటిమని సంతోషించి యిండ్లకు పోయిరి.

ఈ యేర్పాటు చాలామంచిది. వయోజనవిద్య యే రూపంగా చెప్పదలచుకొన్నను, యిందులోని మార్గ మవలంబనీయమే యగును. కాని నాయకత్వము వహింపవలసినవాడు సమర్థుడు కావలెను. ప్రపంచ విజ్ఞానము బాగాకలవాడుగా వుండవలెను. తనతో చేరే నలుగురిలో వుత్సాహము జనింపజేసేవాడు కావలెను. వారి ఆత్మగౌరవము నిలిపి తన ఆత్మగౌరవము నిలుపుకొన గలవాడు కావలెను. వారడుగు ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పగల శాంతుడు గావలెను. యీ సామర్థ్యము, యీ గుణములు పుట్టుకతోరావు. శిక్షణతో

రావలెను. కావున వయోజన విద్యాప్రచారము కోరేవారు సుశిక్షితమగు మానవబల మేర్పరచుకొనుటకు తగిన సంఘ విధానము నంతయు నాలోచింపవలెను.

## ఈ గ్రంథముతో చేర్చి చూడదగిన పుస్తకాదులు

### తెలుగు

*1. గ్రంథాలయ సర్వస్వము 7—16 సంపుటములు

*2. ఆంధ్ర గ్రంథాలయం 1, 2 సంపుటములు

*3. ౧౩, ౧౪, ౧౫, ౧౬, ౧౭, ౧౮ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల సంచికలు

4. పెద్దల విద్య (ఉపాధ్యాయ బోధిని)

కర్త: శ్రీ కే. జే. జీ. సుందరం

5. వయోజనవిద్య 3 పుస్తకములు

కర్త: శ్రీ శనివారపు సుబ్బారావు

6. అంతర్జాతీయ వయోజన విజ్ఞానము

కర్త: శ్రీ జటావల్లభుల పురుషోత్తము

7. వయోజనవిద్య - 1,2,3 పుస్తకములు

కర్త: శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

8. మాపాఠాలు 1, 2 భాగములు

కర్త: శ్రీ గోపరాజు రామచంద్రరావు

9. నూతన అక్షరాభ్యాసము

కర్త: శ్రీ కే. జీ. బాబురావు

10. నంద్యాల మొదటి, రెండవ వాచకములు

కర్త: శ్రీ బి. ఇ. దేవరాజు

11. పెద్దల వాచకము మొదటి, రెండవదశలు

కర్త: శ్రీ కే. జే. జీ. సుందరం

12. హైదరాబాదు పెద్దలవాచక పుస్తకము

1,2,3 భాగములు

13. యువజన పాఠాలు, ఒకటోది

కర్త: శ్రీ బొల్లిముంత శివరామకృష్ణ

14. లాబక్ అక్షరాభ్యాసపటము

15. శ్రీ సర్వోత్తమ అక్షరాభ్యాస పటము

16. వయోజనవిద్య చార్టులు

ప్రకాశకులు: వెంకట్రామ అండ్ కో

17. గ్రంథాలయ గీతాలు

సంపాదకుడు; శ్రీ పాతూరి నాగభూషణం

* 18. వయోజనవిద్య - ప్రబోధ గీతాలు

కర్త: శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు

19. యువజన విద్య

కర్త: పర్సా వేంకటేశ్వరరావు

20. వయోజనవిద్య - మార్గోపదేశిక

(సంపాదకుడు) వయోజన విద్యావేత్త

ఇంగ్లీషు

21. Towards a literate World
22. India shall be literate
23. The Silent Billion Speak

—By Dr. Frank C. Laubach

24. Living Democracy in Demmark
—By Peter Manniche

25. Proceedings of Adult Education Workers' Conference with Dr. Frank C. Laubach held in Madras from 26th to 30th March, 1949.
26. Education for leisure.
27. Rural Adult Education
28. Social Education Literature
—By Dr. S. R, Ranganathan

29. Hand-book for Teachers of Adult illiterates -Prepared by Central Adult Education Committee, National Christian Council, Nagpur, C. P.
30. The Indian Journal of Adult Education
31. Adult Education Review
32. Reports of the National Seminars of Adult Education conducted by the Indian Adult Education Association
33. Publications of the South Indian Adult Education Association
34. Unesco publications relating to Adult Education

## హిందీ

సమాజ్ శిక్షా కేలియే భాషాబోధినీ - శిక్షక్ మార్గ దర్శికా
కర్త: ఉత్తమసింహ తోమర్

సమాజ్ శిక్షా పథ్ ప్రదర్శికా
కర్తలు: మహేశదత్త్ పాఠక్ వగైరాలు

సమాజ్ శిక్షా ప్రదర్శికా
కర్త: ఆచార్య బదరీనాథ్ వర్మా

---

* ఈ గుర్తు పుస్తకాలు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారివి.

# విషయానుక్రమణిక [ Index ]

అన్ని చదువులు గ్రంథాల నమరు కతన
గ్రంథమున కక్షరమె ప్రాణకందమగుట
నక్షరజ్ఞాన మందర కందజేయు
దీక్ష బూనుడు చదివిన దిట్టలెల్ల.

# శ్రీ హరిసర్వోత్తమరావుగారి రచనలు

## వయోజనవిద్య - మొదటి పుస్తకము

"వయోజన విద్యావ్యాప్తికి అఖండ సేవచేసిన, చేయుచున్న శ్రీ హరిసర్వోత్తమరావుగారి ఈ రచన - ఎంతో చక్కని రూపమున వెలువడి నది. వయోజనులకు అతిసులభమైన సుందరగ్రంథము."

— కృష్ణా పత్రిక

"చదువు కొనగోరు వయసుమీరిన వారికందఱకును మిగులనుపయుక్త మైనది. శ్రీ రావుగారు, ఏండ్లుమీరినవారు త్వరగా అక్షరములను గుర్తింప గలుగుతారని తమకు తోచిన పద్ధతిని ఇందు ప్రకటించినారు."

— భారతి

"గ్రామములందు చదువుకొనిన కొందరు పరోపకార పారీణులు రాత్రిపూట ఒక గంటసేపు వినియోగించి పగలంతయు పనిపాటులందు నిమగ్నులైయుండు వయోజనులకు శీఘ్రముగ చదువను వ్రాయను నేర్పుటకు ఏయే యక్షరములతో, గుణింతములతో ప్రారంభించి ముందుకు జనదగునో ఈ పుస్తకము నందలి పాఠములలో సూచింపబడినట్లు మొదటి పాఠములను నేర్పుటలో ఒక్కొక్క పదమును ఆధారముచేసికొని అనేక విషయములను బోధింప వీలగును. వయోజన పాఠశాలల నడుపు గ్రామోద్ధారకుల కీపుస్తకము చాల సహాయకారిగ నుండుననుటకు సందియములేదు. హరిసర్వోత్తమ రావుగారి లాంటి యనుభవజ్ఞులును, దేశాభిమానులును నిట్టి పుస్తకములను వ్రాయ గడంగుట శ్లాఘనీయము.

— గ్రామోద్ధరణ

10 వ కూర్పు 1/8 డెమ్మీ 40 పుటలు, వెల అయిదణాలు.

## వయోజన విద్య - రెండవ పుస్తకము

వారి మొదటి పుస్తకం పూర్తిచేసిగానీ యితర విధానాల ద్వారాగాని వ్రాత, చదువులు కొంచెంగా నేర్చిన వయోజనుల ఉపయోగం నిమిత్తం దిగువ నుదహరించిన రకరకాల శీర్షికల క్రింద చిన్న చిన్న ప్రసంగాలను పెద్ద అక్షరాలలో అచ్చువేసిన గ్రంథం.

